శ్రీ రస్తు.

ఓం నమో మార్తాండగురుపరబ్రహ్మణే.

# శారబొబ్బిలి

భమిడిపాటి. చినయజ్ఞనారాయణశర్మ గారిచే

విరచితము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి

వావిళ్లప్రెస్సున ముద్రించి ప్రకటింపఁబడియె.

1922.

# పాత్రములు.

## 4-వ అంకము.

మల్లమ్మదేవి
వెంకటలక్ష్మి
చినరంగారావు
కమల
వెంకయ్య
హుస్సేను
కూరపరాజు
యాకూబ్
జానా
బూసిదొర
విజయరామరాజు
హైదరుజంగు
జాగోజీరావు
రంగారావు
వెంకళరావు

## 5-వ అంకము.

హైదరుజంగు
విజయరామరాజు
వెంగళరావు
బూసీదొర
పాపారాయుడు
వెంకయ్య
బూసిదొర
చినరంగారావు

# పీఠిక.

---

ఈనాటకము నాయిరువదిరెండవయేట రచియించిన దగుటచే నిం దనేకముగా తప్పులుండుననుట నిర్వివాదాంశము. పాండిత్య ప్రకర్ష నటుండనిచ్చి చరిత్రాంశభాగమునందు నాకు చేతనగు నంతవఱకు నిజము గ్రహియించి యిది కూర్చితిని. కథానుగుణ్య ముగ మూలవ్యతిరేకము లేకుండ తగుపాటి కల్పన లక్కడక్కడ కలవు. ఈచరిత్రమునందు పలువురకు పలుయభిప్రాయభేదములు లేక పోలేదు. అవన్నియు నిట పేర్కొని నాయభిప్రాయానుసార ముగ గ్రంథసాక్ష్యముగ ఖండించుచు వచ్చునరికి అదియే యింత గ్రంథమగును. సమయ మనుకూలించినచో అట్టిచరిత్ర విమర్శనా గ్రంథరచనభాగ్యము నాకబ్బుంగాక. ఈ గ్రంథరచనయందు నాకు దిట్టకవి నారాయణకవికృత రంగరాయవిలాసంబును బొబ్బిలి మహారాజులుంగారి బొబ్బిలిచరిత్రంబును ఆర్మిదొరగారు వ్రాసిన గెజటీయరులోని వ్రాతలును నాకు సహాయపడినవి.

ఈనాటకము 1915 సం॥ లోనే విరచింపఁబడినది; కాని లోకముఁ జూచుభాగ్య మింతవఱకు దానికి లేకపోయినది. 64 పుటలు 1918 లో ముద్రింపించితిని కాని కారణాంతరములచే కాని నట్లే నిలుపుచేయవలసివచ్చెను. ఇటీవల నాకోర్కె నను కరించి శ్రీ వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు ముద్రణావ్యయముభరించి, ప్రచురించుట కియ్యకొనుటచే యిప్ప

టికేని గ్రంథనాశనము కాక, యింకను నిలుచుభాగ్యము లభించి నది. ఇంకను మహోత్కృష్టగ్రంథంబులుఁ బ్రచురించి వన్నెఁ దక్కియున్న నాంధ్రవాణి నలంకరించుభాగ్యము వారికి లభించుఁ గాక యని కోరుచు వారీగ్రంథముఁ బ్రచురించినందులకుఁగా నా నమస్కృతు లర్పించుచున్నాను.

ఈగ్రంథముద్రణమందు మిగుల సహాయపడి అచ్చుతప్పులును, నాతప్పులును సవరించిన మాగురువులును పూజ్యులు నగు బ్రహ్మశ్రీ పండిత పురాణం సూర్యనారాయణతీర్థులవారికి నా సవినయనమస్కారము లర్పించుచున్నాను. అచ్చునందుగాని కథాభాగమందుగాని లేదా, పాండితియందుగాని దొరలిన తప్పులను నాకెఱిఁగించినచో నమస్కారపూర్వకముగా నవి గ్రహించుచు ఈ గ్రంథమునకు రెండవముద్రణాభాగ్య ముండెనేని యందు సవరించు కొందును.

మాడుగుల,
23-3-1922.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,
చినయజ్ఞనారాయణశర్మ.

శ్రీరస్తు.

ఓంనమో మార్తాండగురుపరబ్రహ్మణే.

# శూ ర బొ బ్బి లి.

---

## నాంది

శా. ఆర్యావర్తపటమ్మునం దహితగాత్రాసృజ్మషిం ధైర్యగాం
భీర్యాదార్యవిశుద్ధలేఖిని నిజాభిఖ్యల్ విచిత్రించి రే
ధైర్యాహార్యులు కృష్ణరాయపృథివీధాత్రీట్ శివాజీప్రతా
పార్యోత్తంసులు వారికీర్తిశశి మిమ్మత్యంతముఁ బ్రోచుతన్.

సీ. రాజసింహాదిసద్రాజపుత్త్రులఁ గడు
పారఁ గాంచినయట్టివీరమాత,
తిక్కనామాత్యాదిధీసచివుల నెల్ల
గారాబమునఁ గన్నధీరచిత్త,
శబ్దశాసనముఖ్యసత్కవీశుల నోము
పంటగాఁ గన్నవిద్వాంసురాలు,
అఖిలకళాపూర్ణ లౌపుత్త్రికుల నెంద
అనో కాంచినట్టిగారాలకూచి,

తే. గీ. మొల్లదుర్గావతీసతి మొదలు గల్గు,
ముద్దుఁగూఁతులఁ గాంచినముద్దరాలు,
భరతమాత గుణోపేత కరుణచేతఁ,
బూజ్యులగుసభ్యులను సదా బ్రోచుఁగాత. ౧

ఉ. స్తోత్ర మొనర్పఁగా నెది వసుంధర నొప్పిద మేది కల్గినన్
వృత్రవిరోధి చెంత నసియింపఁగఁ జాత్రత కల్గు చేసిచే
శత్రుకులంబు నాశ మయి చాల యశం బొడఁగూడు నట్టిదా
క్షాత్రము మాసభాసదుల సాకునుగావుత మంగరక్షయై. 3

నాంద్యంతమున సూత్రధారుఁడు పుష్పాంజలి సమర్పించి.

సూత్రధారుఁడు.—ఇంకను కాలవిలంబ మెందులకు? మారిషా! ఇట కొకసారి వచ్చెదవా?

మారిషుఁడు.—(ప్రవేశించి) వచ్చితి నాజ్ఞాపింపుము బావా!

సూత్ర.—మారిషా! నేఁడు మన మీసభవారియెదుటను "బొబ్బిలిచరిత్ర మాడవలయు" నని సభాసదులచే నియమింపఁబడితిమిక దా! వలయు పాత్రముల జతనపఱచి యుంచితివా?

మారి.—(పానూాయముగ) దానిదుంప తెగ; ఆబొబ్బిలిసంగ్రామమే యాడ వలయు నని వీరు నియోగింపవలయునా! మన కీజన్మమునఁ దురకగోల వదలదు కాఁబోలును!

సూత్ర.—రసద్వయమిశ్రిత మగునీగాథయందుఁ దురకలసంభాషణ మంత శ్రుతికటువుగ నుండదుసుమా!

మారి.—ఏమియుండకపోయినను బొబ్బిలివీరుల వీరవాదార్భటులచే నా చెవులు గింగురుగింగురు మనవా! బావా! నాతో ఈనాటక మాడు కొనుఁడు. నే నీయూరు విడిచియే పోయెదను.

సూత్ర.—భీరుఁడా! అంత నాటకములలోని కేకలు వినియే భయపడువాఁ డవు పాత్రలఁ గొన నేల సిద్ధ మయ్యెదవు?

మారి.—ఏమో! ఎఱుఁగక చేసినతప్పబ్బా! ఇది; శృంగారనాటకముల లోని పాత్రములనైన నెట్లో యాడ్చుకొని వచ్చితిని కాని, యిది నా తరమా! ఇంక నా కేవేషమును ఈయ నక్కఱ లేదు లే!

సూత్ర.—మూర్ఖుఁడా! ఇపుడు మునుపటివలె శృంగారకావ్యనాటకాదులు కల్పితగాథలు మొదలగునవి నవనాగరకసదస్యుల మెప్పునకుఁ బాత్రములు కావని యెఱుఁగవా! కాల మెప్పటికిని ఒక్కలాగుననే యుండు ననుకొంటివా ?

మారి.—(తనలో) ఇఁక నీతద్దినము నాకెట్లును తప్పెడిజాడ కన్పట్టలేదు. ముందు విజయరామరాజుగారికి మాత్రము వేంగళరాయనితోఁ గయ్యమాడక తీఱినదా? (ప్రకాశముగ) బావా! అయినచో బొబ్బిలియుద్ధమాడవలయు నంటివి కదా! దానిని విరచించినవా రెవరు?

సూత్ర.—మారిషా! అట్లు దారికి వచ్చి నాప్రయత్నముల కనుకూలుఁడవు కమ్ము.

సీ. శారదాపావనోదారతీరస్థలీ
భ్రాజితమాద్గులగ్రామవాసి,
భాషానుశాసనాపరకుండలీంద్రమా
ర్తాండసద్గురుపదాబ్జానువర్తి,
సరసజనాహ్లాదభరితనిర్దుష్టస
మ్యక్కవితోర్వరునిర్మాణకర్త,
కవిసార్వభౌమాంధ్రకవివీరసూర్యనా
రాయణాతీర్థశిష్యాయితుండు,

తే. గీ. భమిడిపాట్యన్వయోద్భవ విమలకీర్తి
దీధితిస్నాపితాఖిలదిక్శశాంక,
సోమయాజిసుతుండు విశుద్ధయశుఁడు
యజ్ఞనారాయణాఖ్యుఁ డియ్యది రచించె. ౮

మారి.—బావా! తెలియక యడుగుచుంటిని. ఈగాథ ననుసరించిన నాటకము లిదివఱకే యుండఁగా నీతఁడు కూడ నిదియే వ్రాయుటకుఁ గత మెయ్యదియో తెలియునా?

సూత్ర.—మారిషా! ఒకనాఁడు నాతో నాకవియే స్వయముగ ముచ్చ టించియుండుటంజేసి నా కాసంగతి కొంత తెలియును.

చ. కవి కభిమాన మైనయది గ్రంథము కావునఁ జేతనైన వా
స్తవము గ్రహించి దానిఁ బెలుచన్ విరచించెను నాటకమ్ముగా
నెవరొ లిఖించి రంచు మది నెంచుచు నీతఁడు మాననేల? నీ
భువిఁ బెఱపుత్త్రులున్నఁ దనపుత్త్రుని కై జనకుండు కోరఁడే? ౪

మారి.—బావా! అయినచో నే నిప్పట్లు నేమి సేయవలయును? లోనికిం జొయ్యి పాత్రముల సమకూర్తునా?

సూత్ర.—అటులే చేయుము. ఇదివఱకే రాత్రి చాల నతిక్రమించినది. ఇంక జాగొనరింపక నాటక మారంభింపవలయును. (సభవంకఁ జూచి) రసజ్ఞ ప్రమాణపరాయణు లగునో సదస్యులారా!

మ. కృతిలోఁ గాని ప్రదర్శనంబునను గానీ దోషము ల్గల్గ స
న్మతి సైఁపందగు; నీరు పాలిడఁగ హంసశ్రేష్ఠ మానీటి నే
గతివర్జించి పయస్సుఁ ద్రావునో యటుల్గానొప్పు లున్నే నిసం
తతమున్నంతసమున్వహింపుఁడ దెకాదామిమ్మునర్థించెదన్. ౫

ఇది ప్రస్తావన.

శ్రీ ర స్తు.

ఓంనమో మార్తండగురుపరబ్రహ్మణే.

# శూ ర బొ బ్బి లి.

---

## ప్ర థ మాం క ము.

రంగము—గుడారము.

విజయరామరాజు, జగన్నాథరాజును ఆసీనులయి ప్రవేశింతురు.

విజ.—ఓమంత్రిపుంగవా! జగన్నాథరాయా! మనరాజ్యపరిపాలనంబున కెల్ల నాతంకంబుఁ గల్గించుచుండినయాబొబ్బిలివారిప్రతాపానలం బెప్పటికేని, మామక బాహాసి ధారచే నాఱిపోయి, నాకు ముదంబొడఁగూడునా? ఎప్పటికేని నేను సంతోషంబుఁ గనుకాలమువచ్చునా?

జగ.—మహారాజా! ఊఱడిల్లుఁడు. మానవులకసాధ్యమగుపని యేదియు లేదుకదా!

విజ.—ఊఱడిల్లక నేనేమిచేయఁగలను? కాని వారలచరిత్రంబు తలఁచుకొనినంతనే, మనంబున నెంతయునూరటఁ గలుగఁజేసికొందమన్నను వారలపరాక్రమంబులే జ్ఞప్తికి వచ్చి, చేయి వెట్టి కలఁచినట్లు చేయుచున్నవి

తే. గీ. నిదుర వచ్చునె కంటికి? సుదతిపొందు
ముచ్చట యొసంగునే? అన్న మిచ్చ యగునె?
మానవంతున కెందేనిఁ గాని శత్రుఁ
డొకఁడు తనయంతబలవంతుఁ డున్నయపుడు.

జగ.—భూలోకదేవేంద్రా! రణరంగంబున వీరవిహారంబు సలిపి, జన్యంబుల నన్యధరాకాంతుల నోడిచిపుచ్చి, సకలభూపాలోజ్జ్వల మకుట స్థాపిత మాణిక్యమరీచులు దేవరపాదపంకేరుహమ్ములకు నివాళు లొసంగ వసుంధరావలయంబు నిరంకుశలీలఁ బరిపాలించు దేవర కింకేమికొదవ? ఏలినవా రొకింత యోపికఁ బూని యుంటిరేని బొబ్బిలిసహిత మల్పకాలములో దిబ్బ యొనరింపలేరా?

విజ.—అటులే చేయవచ్చును, కాని—

సీ. వితతప్రతాపనిర్జితసకలక్షమా
నాయకుం డగురంగరాయుబలము,
నిరుపమస్థైర్యమందరమహీధరతుల్యుఁ
డైన వేంగళరాయునమితశక్తి,
పాశంఖరాజమహ్మదసైన్యతిమిరమా
ర్తాండపాపారాయుధైర్యగరిమ,
సంగరరంగవిజితసర్వవైరిదా
మెర్లధర్మారాయుమించుదర్ప,
తే. గీ. మలఘుధైర్యుండు చెలికానికులశశాంకుఁ
డైన వేంకయదోగ్రప్రతాపానలంబు
తలఁచుకొనినంత మన మెల్లఁ గలఁగఁదొడఁగె
నకట! ఇందుల కేముపాయమ్ము మంత్రి! ౮

జగ.—ధీరోదాత్తు లగు నేలినవారికే యిట్టివిచారమా?

ఉ. ఇంతదురంతచింత మది నీగతి వందురనేల? మేదినీ
కాంత! వలంతులై నరిపుకాండము నింతకుమున్న తాఁకి దు
ర్దాంతపరాక్రమమ్మునఁ గృతాంతుని చెంతకు నంపలేదెయో
దుంతలఁబద్మనాయకులఁ ద్రుంచుట కింతటివంత యేటికిన్?—

విజ.—జగన్నాథరాయ!

ఉ. నిక్కపుశూరులై నధరణీవరు లెల్లరుఁ గేలు మోడ్చి నా
చక్కనిపాదపద్మములసాగిలి మ్రొక్కఁగ నన్ను నంతయున్
లెక్కకుఁ దేక బెండుగ గణించుచు బొబ్బిలిపద్మనాయకుల్
స్రుక్కఁగఁజేయుచుండిరెదలోఁ గలశంకులరీతి శ్రీహరీ! ౧౦

జగ.—ధరాపురందరా! మాటిమాటికిఁ బరిపంథిబలంబులఁ గూర్చి తలంచుచు వాపోయుచుండుటకన్న నెటులేని వారలఁ గడతేర్చునుపాయ మాలోచించినచో బాగుగ నుండునుగదా!

విజ.—అదియే యేనుఁగూడ యోజించుచుంటిని.

క. ఎటులైన నాదురాత్ములఁ
బటుతరరణరంగమందుఁ బట్టి వధింపన్
దిటము వహింపవలె మ
చ్చటులోగ్రకరాసిచేఁ బ్రజల్ నుతియింపన్. ౧౧

ఇదివఱకే డెనిమిదిసారులు మనవారు బొబ్బిలిప్రాంతములఁ గొల్లలాడ నంపినను కృతకృత్యులు కాకుండఁగనే బొబ్బిలివారిచేఁ బరాజితులైరి. ఈసారి యటు సేయక, యెంతబలమ్ముఁ గూర్చిన వారి నెదుర్కొని యోడింపవచ్చునో, ఆరణం బెంతకాలమువఱ కగునో, అందుల కగుసాధన సామగ్రి యెంత యుండవలయునో, సేకరించి పిదప రణభేరి మ్రోఁగింపవలయును. అంతదనుక మనయభిప్రాయం బారుల కభేద్యముగ నుంపవలయును. కాదేని శత్రుపక్షమువారుకూడ యుద్ధమునకు సన్నద్ధు లగుదురు.

జగ.—దేవా! తమయభిప్రాయం బెంతశ్లాఘనీయముగ నున్నది! మిమ్ముం బోలు శూరశిఖామణులు తలపెట్టినచో నిదియొక లెక్కయే?

క. బొబ్బిలియె కాదు, లోక
మ్మబ్బురముగ వచ్చి యుద్ధమందు నిలిచినన్

తబ్బిబ్బు సేయఁ జాలిన
గబ్బిమగలు మీర లిట్లు కలఁగుట మేలే ? ౧౨

విజ.—కాని యంతటిమహాభాగ్యము నాకెపుడు లభించునో యనిమాత్రము మనంబు తత్తరపడుచున్నది.

ఉ. ఎప్పుడు రంగరాయపృథివీశ్వరు సంగరరంగమందు నేఁ
జొప్పిలు వేడ్కనొంచిరిపుసూదనుఁబాపయఁద్రుంచి వేంగళుల్
ముప్పుఘటిల్లఁజేసి నృపముఖ్యుఁడ నంచును గీర్తిఁ గాంతునో
అప్పుడు నామనోవ్యథ సమస్తముతీఱును మంత్రిపుంగవా !

జగ.—దేవా ! దాని కేమికాని యిప్పుడీరాణ్మహేంద్రవరమునకు భేటీకి రమ్మని కబురంపుటలో వారియభిప్రాయ మేమి ? మఱియు.—

క. సాహాబేఁట ! యాతఁ డెవ్వం
డో హైదరుజంగునాముఁ డుత్తాలధను
ర్బాహులతో రా నేటికి ?
నూహింపఁగ నేమికార్య మున్నదొ ! యిచటన్. ౧౪

నవాబుగారిచే నియమితుఁడే యీహైద రని తలంత మన్ననో !

మ. పటుబాహాబలనిర్జితారి యగుడూప్లెనాయకుం డాహవ్రా
త్కటతేజోనిధి యైనబూసిదొర యొక్కండై పయినాన్నాహసో
ద్భటసేనానులతోడ వచ్చెడినిమిత్త మ్మేమి యై యుండు ని
చ్చటికూహింపఁగఁ దోఁచదాయె నృపవంశశ్రేష్ఠ ! సుంతేని యున్. ౧౫

మ. వసుధాధీశునకనుజ్ఞపై నిట జమాబందీ యొనర్పంగ బూ
సిసహాయుండుగ వెంటఁ బెట్టుకొని వచ్చెం బోలునం చెంచనే

ల సహాయేచ్ఛ పఠాణినేతలకు నెల్లన్ రాజులుంగూడఁ గై
వసమై లొంగి చరించి వేళలకుఁ గప్పమ్ముల్లఁ జెల్లింపఁగన్.

రాజ.—ఓయమాత్యా! వినియుంటివి కదా! గోలకొండరాజ్యంబు నెల్ల విక్రమలీలఁ బాలించు "సలబత్ జంగుఁ" డనుతురుష్కసార్వభౌముని, ఆర్యావర్తంబునఁ గొంతప్రదేశంబు బాహుబలంబున నిర్జించినపరాసులప్రతినిధి యగుడూప్లేదొరను. పరాసువారిబాహుబలంబును దర్పంబును గనుఁగొని తురుష్కసార్వభౌముండు వారలతోఁ గలసియుండుట శ్రేయోదాయకం బని యోజించి తనదేశమందలిసామంతనరపాలురయెల్లరు లణంచుటకును వలయుతఱిఁ దనకు బాసటగ వచ్చుటకును ఒడంబడికలు జరపికొని కంభముచెరువు మొదలు శ్రీజగన్నాథమువఱకును గలదేశంబునందలిసర్వాధికారంబులును దొరల కొసంగియుండుటచే నారాజులయొద్దఁ గప్పములఁ గొని తెచ్చుటకయి యీబూసిదొరను నియమించిరి. మఱియు,

తే. గీ. తనకు దేశంబు క్రొత్తయై తనరుకతన
నెల్లవృత్తాంతముల వచియించుకొఱకు
సచివుఁ జేసిరి హైదరుజంగు నగుట
వార లిప్పుడు వచ్చియున్నా రిచటికి. ౧౭

.—అయినచో జమాబందీ యొనర్చుటకు వారు రావచ్చును కాని, యీరీతిగా సకలసేనాసమేతులై రానేల?

—ధిషణాసముద్రుఁడ వగునీవు సమయమునకు మంచియుపాయముఁ దోఁపింపఁజేసితివి. సకలసేనాపరివృతు లగునీదొరలసాయముం గొని నాయభీప్సితము నెఱవేర్చికొనియెదఁగాక!

మోదమున మీఱ నెక్కుడుచమూతతితోఁ జనుదెంచుచున్న యీ
హైదరుజంగుముఖ్యయవనాదుల నారసి త్రోడుగొంచునన్

వేదనఁ బెట్టుచున్న యవినీతుల సంగరంగమందు వి
చ్ఛేదము సేయువాఁడ నిఁకఁ జింతిల నేటికి? మంత్రిసత్తమా

జగ.—దేవా! అప్రతిమానబుద్ధివిశేషభాసురులగు దేవరయాలోచన దుర్గ్రాహ్యంబే, కాని, యకారణముగ బొబ్బిలివారితోఁ గయ్యముఁ దెచ్చిపెట్టుకొనుటకు కాపరాసువారంగీకరింతురో, లేదో, యనిమాత్రము సందేహించుచున్నాను.

విజ.—మంత్రీ! అవిచారణ మంత మాననీయము కాదు. ఏమంటివా "ధనమూల మిదం జగత్" అనియున్నదే కనుక వారి కింతసొక్కము గ్రమ్మరించినచో సర్వకార్యమ్ములును సానుకూలమ్ములగును.

జగ.—ఆతురకవాని నాశాసముద్రమున ముంచనగును కాని, ప్రాజ్ఞతావిశేషముగలయాపరాసువాని నేమిసేయనగును? అది దుస్సాధమేమె కదా!

విజ.—అమాత్యవర్యా! ఎంతెంతటివారిబుద్ధివిశేషంబులుఁగూడ మనకు దురూహంబులు కావు. ఇం దొక్క విశేషము కల దాకర్ణింపుము.

తే. గీ. సత్యసంధు నొగి ననత్యసంధుఁ జేయు
నన్నృతశీలుని సత్యసంధునిగఁ జేయుఁ
జెలిఁ బగతుఁ జేయుఁ బగతునిఁ జెలిఁ బొనర్చు
ధనము సేయని దేది? యీధరణియందు. ౧౫

జగ.—ఏలినవా రానతిచ్చినది నిశ్చయమేకాని, మనము లంచ మిచ్చిన మాట బొబ్బిలివారికిఁ దెలిసి, వారుకూడ నేమేని యొసంగెద మని చెప్పినచో, నీదొరలే మనల వంచింతురేమో? అట్లేని కార్యము మఱింత దుర్ఘట మగునుజుండీ!

విజ.—మనపక్షము వీరు పూనియున్న వారనియెట్లు తెలియనయ్యెడిని? తెలియుఁగాక! తొలుత మనవాగ్జాలమునం దగుల్కొని మనకార్య

"మొనరింతు" మని ప్రతినఁ బూనినవారు ప్రతిపక్షకార్య మెన్నఁటికిని పూనఁజాలరు. మఱియు,—

మ. ధన మొక్కించుక యిచ్చి "మద్రిపుల నుద్ఘాటించి తద్రా
జ్యమున్ । గొని నా కిచ్చినతత్క్షణమ్మ కయిఁ జేకూర్తున్
ధన మ్మెంతయో" । యని యాశాజలరాశి వారి దిగఁ
ద్రోయన్ దప్పకుండంగ నా । పని సర్వమ్మును సానుకూల
మగు శేవన్ జేయరే యాదొరల్. ౨౦

దొరగా రీపాటికిఁ గచ్చేరీ తీర్చియుందురు. వారికొఱకై తెచ్చినసామగ్రి యంతయు వారి కంపియున్నావుకదా! ఇంకను మనము వారలదరి కేఁగుట కేల యోజింపవలయును?

జగ.—దేవరా! వారిసావకాశ సమయముఁ దెలిసికొని రమ్మని మనసేవకు నటకంపియున్నాను. వాఁడు వార్త తెచ్చినతోడనే తమ రచటికి దయ చేయ వచ్చును.

వెంకారెడ్డి.—(ప్రవేశించి) భూలోకదేవేంద్రా! విజయోఽస్తు. విజయోఽస్తు. తాము వచ్చి దొరగారిదర్శన మభిలషించుచున్నారని హైదరు జంగుబహద్దరువారితో మనవిసేయఁగా దొరగారు కచ్చేరీ తీర్చియున్నారనియు, ఇది మంచి సమయ మనియు, వైళంబ తా మచ్చోటికి విచ్చేయవలయు ననియు సెలవిచ్చియున్నారు.

జ.—మంత్రివరా! ఇదియే కడు మంచితరుణమఁట! రమ్ము వారిని సందర్శింపఁబోవుదము.

(నిష్క్రమించుచున్నారు.)

రంగము-కచ్చేరి.

బూసిదొర, హైదరుజంగు, నాగోజీరావును కూర్చుండి ప్రవేశింతురు.

బూసిదొర.—హైదరూ! ఈవేడిపోట్లు నెన్నినాళ్లిట్లిక మనము పయనము సాగింపవలయు? నీ వేల పోయి జమాంబదీపనులను కొంతతే కుండఁజేసికొని రారాదు?

హైద.—దొర్గారూ! మందీ లష్కర్ గిష్కర్ హింఖ హిక్డానించ్ఛల్నేకు పశాము. హమ్నిదేశాల్ రాజోంకు ఛేట్కి హిడ్డాకి అవ్ తాఖీదుల్ పంపేమ్; మన్కు హిఖ్డానించి ఖదల్ డాన్కి జర్గర్ కూచ్ బీనై

బూసి.—ఎవరెవరికి తాఖీదు లంపియున్నావు? ఎవరెవరు వచ్చిరి?

హైద.—నాగోజీసాబ్! ధొర్గార్కి హంతా హిట్రం హిట్రం సేసి బోల్డో

నాగో.—చిత్తము (కాగితము చూచి) పిఠాపురము, ఖాసింకోట, కిమిడీ నారాయణపట్టణము, సత్యవరము, విజయనగరము మొదలగు జమీను రాజులందఱకును ఎవరెవ రెంతెంత పేష్కసు చెల్లింపవలయునో వి రము వ్రాయుచు, తాఖీదు లంపియున్నాము. అందఱును వచ్చి త మీయవలసిన పైకము చెల్లించి రసీదు లందియున్నారు. విజయనగరమ వారు స్వయముగ దయచేసియున్నారు.

బ్యూసి.—వా రేల తమకప్పము చెల్లింపక జాగొనరించినారు?

నాగో.—వారు తమకష్టనష్టములఁగూర్చి తమతో స్వయముగ ముచ్చటింప సెలవందియున్నారు.

హుస్సేను.—(ప్రవేశించి) హుజూర్! యిజ్యనగ్రదేషాంమే యేల్తా రాజా హుందీ లేదూ! హూడూ దర్శణాన్కి ఆయా మన్వి సెయ బోల్తాడ్.

బూసి.—వారిని లోనికి రమ్మనుము. (హుస్సేను నిష్క్రమించును.)

విజయరామరాజు.—(ప్రవేశించి తనలో) కారుమబ్బులఁ దలపించునల్లని బిఱుసుగడ్డముగల యాకఱుతురకయే హైదరుజంగు కావచ్చు—ఈ తఁడే బూసిదొర యయి యుండనోపు-(పైకి) సలాము మూసాబూసి దొరవారికి.

బూసి.—సలాము విజయనగరపు పెకిమీనికి.

విజ.—సలాము హైదరుజంగు బహద్దరువారికి.

హైద.—సలామాలేఖుమ్ రాజాజీ ! తుంబీ ఆతఖ్తాఫర్ బైఠో.

విజ.—సాహెబులు చెప్పినట్లు చేసెదను. (ఆసీనుఁడగును.)

బూసి.—ఏమోయి ఓఁడా ! ఎందుచేత మీదగ్గఱనుండి పంద్రెండేండ్లీ పేష్కసు చెల్లక యున్నది? ఇప్పుడేని దెచ్చితివేమో ముందుగఁ జెల్లింపుము.

విజ.—పరాసుసార్వభౌమా ! పేష్కసున కేమి? అంతయు నొకతృటి లోనే చెల్లించెదను కాని,

హైద.—హేంమియ్యా! ఖానీ యేఘానీ సెప్తాది ఘుడ్వ ధాటి హేంతా ధిన్మ హైంది హింకా యెన్కాయేసి ఊర్డన్నావ్ క్యాబోల్తావ్.

విజ.—దేవా ! పంటకారులు పండక ప్రజల కమితనష్టమాపాదించుచుం డుటచేతను, మాచుట్టుంగల పాళెగాండ్రౌనరించెడి యక్రమంపుటల్లరు లచేతను ఇంతయాలస్య మైనది. ఇఁకముందు సక్రమముగనే చెల్లింపఁ గలవాఁడను.

హైద.—మాఖీ సర్కార్ హీఖ్నా హుకుం నీఖీ మాలుమ్హోయ్.

గేయము. యెవ్రెవ్రు పేస్కాస్ హివ్వాపోతార్ మాఖీ
—హళ్లాళ్కీపట్కోని సంపెయ్యడం, హాళ్కీ సంపెయ్యడమ్,
యెవ్వెవ్రు గడ్బడ్కే హెప్డు సేస్తుంటాడో
యేఆద్మీఖాకీ నర్కెయ్యడం, ఆడ్కీనర్కెయ్యడమ్,

లూటీలు సేసేటిర్ఘూటాకోర్లందర్ని
యేకేటు కొక్కణ్ణి యేసెయ్యడం, ఆడ్కి యేసెయ్యడమ్,
మామాట లచ్చమ్మొ సెయ్కున్న రాజాల్కి
మాదెబ్బా సూపించి మాసెయ్యడం, ఆడ్కి మాసెయ్యడమ్.

విజ.— మీ కంతటియధికారము కలదని మాకిదివఱకు తెలియకపోలేదు. కాని మీ రారీతిఁ జేయుచుండుట లేదనిమాత్రమే నెఱుఁగుదును. మీపాశెగాఁడు మారాజ్యమందల్లరులు చేయించి మాకుహితు లీయవలసినపన్ను మాకు రాకుండఁజేయుటచేఁగదా! మీకప్పము చెల్లింప నింత తడవైనది. వారే మాకుఁ గ్రమరీతిని పైకము చెల్లించుచుండినచో నేను మాత్ర మేల మీకుఁ గొదవఁ బెట్టియుందును?

హైద.— హేం రాజాజీ! మీది సిస్తు హెవ్డూ రాకుండా సేస్తాడ్ హోడ్మీదికి నీవు కైకూ లడాయీకి మొర్గి సాఫ్సఫాయి సెయ్వూ?

హుస్సేను.— (ప్రవేశించి) ధొగ్గార్కి టిఫెన్ టైమ్ హైంది. హాఖ్ఖాఖి దయసెయ్యాలా మన్వి.

బూసి.— హైదరూ! ఈయెకిమీనిలగ్గ్గులఁ గనుఁగొనుము. నేనుఁగూడ నిప్పుడే వచ్చెదను. (హుస్సేనుసహితముగ నిష్క్రమించును.)

విజ.— సాయేబుగారూ! వెనుక షేరుమహమ్మదుఖానువారు దయచేసి బొబ్బిలివారిపౌరుషమునకు మెచ్చి వారికి రాజాము జాగీరుగ నొసఁగియున్నారుకదా! నాఁటినుండియు వారు కన్నుగానక సంచరించుచున్నారు. మారాజ్యమునం దెల్లపుడల్లరులఁ జేయుచునే యుందురు.

హైద.— హాది యిడ్డూ మాఖీ హెంన్కి హయ్యా! ధాన్కి ధీన్కి హేంటి హుంది. నీది సెల్లించ్వాలా పేష్కస్ మాటా హేంటి సెప్తావ్?

విజ.— అయ్యా! చెప్పుట కేమున్నది?

హైదరుజంగుసాయేబుగారూ! ఆ బొబ్బిలివారు మిమ్ములను సరకు చేయరు. మీరు చేయుదస్తులోనికి వారు రారు.

ఉ. రావుకులప్రభూతుఁడు పరాక్రమనిర్జితసర్వవైరిగ
ర్వావిలచిత్తుఁ డంచితదురాగ్రహదుర్మదదోర్బలుండు తద్
భూవిభుఁ డెంతధన్యుఁడో! మిముఁ గసయితమ్మునుబూరికింగొనం
డావల నేమిచెప్ప యవనాధిప! వానియదృష్టసంపదన్. ౨౫

మఱియు మీరు బొబ్బిలి యనినచో సామాన్యముగా నూహించుచున్నారు కాఁబోలును? అట్లెంతమాత్ర మెంచఁజనదు.

హైద.—క్యా రాజా! మీదీ భారత్ కితాబ్ మే పాండ్యాసాబ్ బీబీ హుందీ లేవ్; దాందిమొగ్గూ బీడ్డూ హాడూ; హాడ్డిఖంటే సత్యా హాక్యా హైతుంది హోయ్; మీదీ సెప్తావ్; భొబ్లీరాజాఖి;

విజ.—అదిగో! ఆభీమునంతటివాఁడే వాంధ్రలోఁగూడ నొక్కఁ డున్నాఁడు.

హైద.—హోడ్డీనామ్ బోలో!

విజ.—అతని పేరు తాండ్రపాపారాయఁడు. వాని పేరు వినినచోఁ బరిపంథిరాజగజంబులకు సింహస్వప్నమే?

శా. అద్రుల్ తల్లడిలున్ గజవ్రజము హాహాకారముల్ సేయు, మేల్
భద్రాశ్వమ్ములు భీతి హేష లిడుఁ, గంపమ్మందు భూచక్ర మ
త్యుగ్రాహంకృతి వీడు వైరితతి, సంక్షోభించుఁ దారాపథ
మ్ముద్రిక్తాగ్రహుఁడైన పాపయక్రుధాహుంకారముల్విన్న చోన్

హైద.—హారే! తాండ్రాపాపా పేరూ సెప్తావ్! భొబ్లీహాడీదగ్రా హింకా యెవ్వూయెవ్వూ వున్నాడ్ బోలోమియ్యా!

విజ.—మీ రడుగుచున్నారు కావునఁ జెప్పకుండుట భావ్యము కాదు ఆ రంగావనిపాలకుం డన్నినో సామాన్యుండు కాఁడు.

ఉ. భండనభీముఁ డార్తజనవత్సలుఁ డంచితసాహసాహవో
ద్దండపరాక్రముండు రిపుతండధరాధరకాండఖండనా

ఖండలుఁ డెల్లలోకము ముఖాముఖి గెల్వఁగఁ జాలురాజమా
ర్తండుఁడురంగరాణ్ణృపశశాంకుఁడు హైదరుజంగుసాయెబా॥

హైద.—హంతా బడావస్తాద్ బిడ్డా హుందీ వోయ్ రంగ్రావ్ ! మాదీ హుందీ లేవ్ సిద్దీబిలావ్ ! హాడ్కి హైకాఁ్వసత్వా హోయ్ వీడూ !

విజ.—అయ్యా ! అతనిబలపరాక్రమంబులు మీర లేమి యెఱుంగుదురు ?

క. బీరము, శౌర్యము, ధీరత,
యూరూఢిగఁ బిన్ననాఁట నతనికి దాదుల్
క్షీరములఁ గూర్చి యిచ్చిరి,
గారవమున లేకయున్నఁ గలుగునె యిట్టుల్ ? ౨౮

హైద.—హింకా హచ్ఛా యెవ్డాయెవ్డా హున్నాడ్ బోలో !

విజ.—(తనలో) వీనికోపభూరుహబీజ మిప్పుడిప్పుడే మొలకలెత్తుచున్నది. ఇంక మద్వచనరచనాదోహదంబున దానిన్ వృద్ధినొందించి శాఖోపశాఖలుగఁ బరిణమింపఁజేసెదఁగాక ! (ప్రకాశముగ) హైదరుజంగుసాయేబుగారూ ! ఆ బొబ్బిలిగడీయందున్న యెల్లర పరాక్రమంబులు నున్నవున్నట్లు చెప్పినచోఁ బాగఁద్తగను, అసూయకలవాఁడ ననియుఁ దలంతురేమో యని సందేహించెదఁగాని,—

ఉ. రంగనృపాలసోదరుఁ డరాతిశిరస్థకిరీటభాసితో
త్తుంగమణీమరీచిపదతోయజుఁ డీఁటియ చేతఁ బూని తా
సంగరభూమి నిల్చునెడఁ జాలునె? యీపదునాల్గులోకముల్
భంగము నొందదేరిపుబలంబు భవాదృశులెక్క లెక్కయే?

హైద.—హంట్టీయిార్డు హాడ్లా యెవ్డా వోయ్.

విజ.—అతనిపేరు వేంగళరాయఁడు. వారిమేనమామ యగు దామెర్ల ధర్మారాయఁ డనునొక నృపపుంగవుఁ డున్నాఁడు. వయస్సుచే నాతఁడు ముదుసలియే యైనను యుద్ధరంగమునమాత్ర మాతఁడు తరుణుఁడే.

శా. మర్మమ్ముల్ విదళించు ఖడ్గధరుఁడై మాత్సర్య మేపారఁగా
ధర్మారాయఁడొకండెయుద్ధమున నౌద్ధత్యమ్ముఁ జూపించుచు
న్నేర్మిన్నిల్చినపక్షమందు సకలోర్వీనాయకుల్గూడఁ దా
మ్మోర్మిన్వీడి నమోనమో స్తన రె? వేయుం జెప్పనిం కేటికిన్.

హైద.—రాజామియ్యా! హెందుకు హాట్టా పిర్కి సెప్తావ్ మాఖి హింకా హాండ్లో హెవ్వూరి హెవ్వూరి వున్నార్; హాళ్లందర్కి బోలో.

విజ.—తురుష్కాగ్రణీ! అందఱి పరాక్రమవంతుల వేర్వేఱుగఁ జెప్పనేల?

సీ. గబ్బిసింగపుగున్న యుబ్బు పోఁద్రొబ్బు బా
హాబలశాలి వేంకయ్య యొకఁడు
ఎక్కటికయ్యాన ముక్కంటినేనిఁ ద్రుం
పఁగఁ జాలునట్టిరామయ్య యొకఁడు
మత్తేభముల మదోద్వృత్తిఁ జొత్తిల మొత్తు
సాహసగుణుఁడు బుచ్చన్న యొకఁడు
గాండీవిగతి వైరికాండమ్ముఁ జెండును
ద్దండుఁ డౌనరసరాయుం డొకండు
తే. గీ. మఱియు నినుగంటి నరసింహమనుజనాథుఁ
డవులఁ గాకర్లపూడి వేంకావనీశుఁ
డాదిగలజోదు లెందఱో యీనృపాలు
నెపుడు సేవించుచుండెద రేమిచెప్ప? ౩౧

ఇఁక సైనికులభంగియు, దళవాయులసంగతియుఁ జెప్పనక్కఱలేదు. వీఱును నొకరికొక రీడుతివియనిపోటుమానిసులే; వేయేటికి?

గీ. అచటఁ బుట్టినకోమటి యైన వీరుఁ
డచట జనిఁ గన్న పసిపాపఁ డైనశూరుఁ

డచట నున్నట్టిమార్గాల మైన హారియె
వేయు నేల ? తురుష్క భూవిభువరేణ్యా ! ౩౩

హైద.—హార్దీ భల్యామ్మ హుంచే మాఖీ యేం తేఖ్ పోతే మాఖీ యేం. మాఖీ నీవు సెల్లించవల్సింది పేష్ఖుస్ మాటా హేంటి బోల్తావ్. హాడ్డీభల్యామ్మ మీదీ సత్యా మీదీమీదీ సూస్కుండి. మాఖీ క్యాజరూరత్ వోయ్.

విజ.—నేను తమతో విన్నవించుకొనియెడిది సాంతముగా విని మఱియు నన్నుఁ గప్పము సంగతి యడుగుఁడు.

హైద.—హారే సైతాన్ పిళ్ళాస్ నీదీ గోసా సెప్పవోయ్ యింటామ్.

విజ.—మనము మన ప్రభువు లగుతురుష్కులకుఁ బంద్రెండేండ్లనుండి కప్పము చెల్లింపలేదనియు, ఆసొమ్మ వసూలు చేయుటకయి నవాబుగారి పంపున మంత్రులు స్వయముగ దయచేసినా రనియు, మనల [illegible] రావలసినదిగాఁ దాఖీదు లంపినారనియు, నేను వారికి వార్త పంపఁగా. వారు నాకు మరల నంపినవార్త యిది :—

ఉ. ఎవ్వఁడు మీనవాబు మఱి యేమిది కప్పముఁ గట్టుఁడంచుమ
మ్మివ్విధిఁ బృచ్ఛ సేయుటకు నెవ్వఁడ వీవు తలంప వింతబల్
రవ్వ యిదేల? మేమయి పరాసులభేటికిరాము మీరు పొం
డవ్వల కేము శూరుల మటంచుఁ దలంపఁగలేవె ? భూపతీ!

హైద.—(క్రోధరక్తారుణ నేత్రుఁడై) అరే! దుర్మార్గ్! రంగారావ్! ఆజ్ తక్ హమారా గులామ్ హోకర్; తేరే ఆంఖ్ శిర్ ఫర్ చఢాహు వారే! క్యా! క్యా! క్యాబోల్తే హై! కౌన్ నవాబ్! అవుర్ కౌన్ హైదర్; హై రే! థోడా రహో! థోడా రహో! ఇస్ వృత్తాంత్ హమారా నబాబుజీకు బరాబర్ మాలుమ్ కరాకర్, తో భొబ్లీ సబ్ ఆగ్ సే నాశ్ నహీ కరేతో మేరానామ్ హైదర్ జంగ్ నహీ హై; క్యా! క్యా! భొబ్లీరంగ్డూ హేంటీ హేంటీ సెప్పేడ్

"నవాబ్ ఖాన్! మాదీ యిూర్దూ హుంది. హోర్ది ఖేటీకి ఝింరాం"
బోలేగా! మాదీ ఫరంగిమూకా హాంటే హోడ్కి హాంత హొల్లచ్చేం
హుంది. మాదీ నవాబ్ గార్కి మన్విబోలి, హోడ్డీ హుంస్లే భొబ్లిఖిల్లా
హాంతా భూద్దెభుంగా సేయిస్తామ్ మాదీ తఖాఖా గేఖో! హిది
తుర్కిహోడ్దిదెబ్బ హోడ్కి మాలుమ్నహి! హై అఛీ బోలా!

గేయము. హీరాభొబ్లీహోడ్కి మీరంతా షూడంగ —

షారీరంతో పట్టి షాదీ హైతామ్,
ఘుండార్ ముగంలాటి తాండార్ పాపాపట్టి
ఘుండేలు సీరించి బొంఢా హేస్తామ్,
భగ్గూన భొబ్లీఖి హాగ్గిలో పెట్టించి
భుగ్గీఖీ సేయించి ఘాయంటామ్,
హిఖ్ఖాడ హున్నట్టిషఖ్ఖానజీర్లాకి
ముఖ్ఖాలకి ఖోసి ముద్దా సేస్తామ్. ౩౪

విజ.—యవనసార్వభౌమా! మీబలపరాక్రమంబు లే నెఱుంగనిది కావు. కాని నాదొక్కమనవి. మీ రిప్పుడు చెప్పినచొప్పున బొబ్బిలిని జయించి యాపురమ్మున మమ్ము భిక్షుకులఁ జేసినచో ఆనాఁడే నేను మీకీయవలసిన కప్పము బొబ్బిలినుండి వసూలు కావలసినదియుఁగూడ తమకు బాఖలు చేసెదను. బొబ్బిలివారి నన్నన్నో తమ రూరక పొమ్మన నక్కఱలేదు. అచటికి సమీపముననే కలపాలకొండ మన్నెము వారి కొసంగవచ్చును. ఏవిధమైన చిక్కులును లేకుండనే ప్రతిసంవత్సరము మీకుఁ గప్పము వసూలగుచుండుట కిది మంచియుపాయము. మాకు వైరులుగ నుండిన బొబ్బిలివార బాధలనుండి మమ్ముఁ దప్పించిన ట్లగును. మీకుఁ గ్రమముగఁ గప్పము వసూలగుచుండును.

హైద.—(యోజించుచు నూరకుండును.)

విజ.—(తనలో) వీఁ డిప్పుడిప్పుడే నామాయావాగురలోఁ దగుల్కొను చున్నాఁడు. వీనికి లంచ మిచ్చెద నంటినేని నాకార్యము సానుకూలము కాఁగలదు.

తే. గీ. మొదట నామాయమాటల మొలక లెత్తి
పిదప రిపువర్ణనముచేత వృద్ధిఁ గాంచి,
నట్టియీతని తీవ్రకోపావనిజము
పూచి ఫలియింప నాకోర్కె పూర్తి యగును. ౩౫

(ప్రకాశముగ) సాయేబుగారూ! ఇం దింతవిశేషముగ యోజింపఁదగు విషయముకూడఁ గన్పట్టదు. బొబ్బిలివారికి మీ రేమయిన నపకారముఁ జేయుచున్నారా? వారియొద్దనుండి తీసికొనినదానికి బదులుగ వారి కాపాలకొండమన్నెము మరల నిచ్చుచు నేయున్నారు. ఇం కిది వారి కెట్లపకార మగును? (చెవిలో) ఈబొబ్బిలి సింహాసనమున నమ్మ్రుతి షిక్తులఁ జేసితి నేని యెవరికిని దెలియనీకుండ మీకుఁ బం[డెండులక్షల] రూప్యంబు లిచ్చెదను. ఆశ్రితున కీమాత్ర ముపకారము చేయుట వింత కాదు. మీయాజ్ఞలను లక్ష్యముసేయనివారలను దండించుట మీకు విధాయక కృత్యమే కాన మీ రట్లు చేసినచోఁ బయియధికారులుకూడ నోరు మెదల్పఁజాలరు, నా కత్యంతోపకారము చేసినట్లగును.

హైద.—(సంతసముతో) రాజాజీ! నీవు మాకు యిస్తావ్ బోల్తా బారాలాక్ రుపియామే హిడ్డూ నద్దూ యిస్తావ్ లేకపోతే మంచిసావ్ కారమే జామీన్ యిస్తావ్ బోలో! మైబోల్తా; తుమ్కూ హాభొబ్లీమే తఖ్తా హౌందీలేవ్ సింగాసన్! ధానికి నీకు యెక్కిస్తావ్! మతీ మాదీ సేస్తావ్ పని బోల్తా యిను.

పంచచామరము.

లడాయిలోన భొబ్లి హాణ్ణి లఛ్చ సెయ్యకుండనా
గడీని హడ్విహడ్వి సేసి ఖాల్చి భూడ్దె సేస్తమేం

బడాయినై గడీని నీఖు పట్కు ఖట్టుతాము దేఖ్
బడాజిసాబు! క్యాబి బోల్తె! పర్వనై తు బోల్తా బోల్.

విజ.—చెప్పుట కేమున్నది? మే మెన్నఁడేని యొక్కమాటవారమే కాని యిన్నిమాటల వారము కాము.

ఉ. ఆర్తజనప్రసన్నుఁ డగునాహరిపాదము లాన; మీర లా
మార్తుర గెల్చి యాపురము మాకు నొసంగిన యాక్షణంబ
చే। కూర్తును మీధన మ్మవని క్రుంగిన విష్ణుపథమ్ము వంగినన్
ధూర్తతకాదు మీ మెదుటఁ దొల్లివచించిన దెల్ల హైదరూ!

మీకు నామాటలయం దొకవేళ నమ్మకము తగులకపోయినచోఁ గొంత రొక్కము ప్రస్తుత మిచ్చెద. మిగిలినది మాకు బొబ్బిలి యభిషేకము జరిగినప్పు డొసంగెదను. మఱి మీరు మాకు బొబ్బిలి యొసంగెద మన్నందుల కేమిజామీను?

హైద.—హింజ్యారాజా! మాదీ నవాబ్ వంశమేఁ యేక్ ఠీక్ బాత్ బోల్తా; బద్మాష్‌మాటా మాఖీ సంపేశ్నా రాదు. మాదీ ధర్మాణం దైభం మీదయేసి నీశ్చయం సేస్తామ్.

క. ఝుఖటే బాత్ మై బోల్తా,
నఖో జూటా బాతు మాఖి నాదీబాత్ స
చ్చా ఖోదా సాచ్చిగ దేఖ్ మా,
ది ఖొరాన్ సాచ్చిగ యినండి దీన్ రాజాజీ. ౩౮

గేయము. హల్లా దైభం మాఖీ హవ్వారం హైనార్
హారు సూస్తార్ మేము హంటాం ధీన్ని
ఖిల్లాభోబ్లీ సాబ్ సే గిర్గిర్ కొట్టేసి
ఖేల్ కర్తా! హాభోబ్లి మీఖీ యిస్తామ్

మళ్లీ బద్మాష్‌మాటా మాఖీ బోల్తా నహీ
మామాట నిశ్చయం మారాజ్ సునో
హిల్లిగ్గో కైజార్మే యేస్కొని సెప్తామ్
యీరాభొబ్లీ మీఖీ హిచ్చి యేస్తామ్. ౩౯

ఖరార్ ఖరార్ ఖరార్.

మాదీ కైజార్ పట్టి నిశ్చయం సెప్తామ్ మాఖీ భొబ్లీఖి కొట్టి మీఖీ యిచ్చియేస్తామ్. ఝూటాభాత్ నహీ (చూచుట నటించి) హల్లగ్గో! బూసీదొర్గార్ హిడ్డాకి హాతా హైతున్నార్. హార్తోటి హిది మొర్గి లడాయికి మేరా సిబ్బంది తయ్యార్ సెయ్‌వాలా.

బూసిదొర.—(ప్రవేశించి) సాయెబా! ఈపుడమి ఱేఁడు మన కీయవల యుకప్పమునుగుఱించి యేమి చెప్పియున్నాఁడు?

హైద.—సర్కార్! హిజ్యారాజా బోల్తావ్ మాదీ ఖూష్మూ ఖీష్మా మే అచ్చా పంట నహీ! హప్పటిక్కి మాదీ ఖిప్పం మాం ఖట్వాలా హోండీ హాంటే, భొబ్లీ హేల్తా హుండ్లే బడేవస్తాద్ రంగ్రావ్! హాడూ వచ్చి మాదీ శిస్తు దస్తా ఖానిడ్డు హాడూ బడా పౌరుస్సాలీమే హున్నాడ్ అంటాడ్ సాబ్.

బూసి.—బొబ్బిలివా రీయవలసినపన్ను చెల్లకపోయిన మానెఁగాక! తానీయవలసినకప్ప మేల చెల్లింపఁగూడదు? ఆబొబ్బిలికి మనమే వేఱుగ కబురంపి పన్ను వసూలు చేయుదము.

హైద.—భొబ్లీహాడూ హోడ్డీ సామ్ము హివాక్కి పోడ్డం ఖాక, హిజ్యనగ్రదేశంమే ఖితూరీ మొర్గి రైతుహోళ్లూవుండ్లే హోళ్కి సెప్పి హోరాజాఖీ సామ్ము హైవసూల్ సేస్తాడ్! మఱి మంది భేటిక్కి ఆవ్‌మే మన్ము ఖబ్రూ సేస్తే హాడూ హల్లచ్చం సెప్పి హిడ్డాకి ఆతా హై! హిజ్యారాజా ఖబ్రూ సేస్తే ఆడూ బోల్తా "ఆరే! కోన్‌రే బూసీ! కోన్‌రే హై

దర్! వాళ్లధగ్రాకి మాం కైకూ ఆతా? వాళ్కి జర్గుర్తే హుంటే వాళ్కి రమ్మన్” అంటాడ్ సాబ్!

బూసి.—అయినచో దీనినిగురించి నీవేమి యోజించుచుంటివి?

హైద.—సర్కార్! నాఖీ హూక్టీ తోస్తాహుంది; యీహిజ్యారాజాఖి లష్కర్ గిష్కర్ మే భతే ఘూప్ది హుంది. యిది షాహాంమే మన్మ తీసోక్ని, భొబ్లి పోయి వాడ్డి ఖోట్టి యీడ్కి హిస్తే, యిత్ గాడూ బోల్తా భొబ్లీమీదా రావాల్సింది హిజ్యనగ్రంమే రావాల్సింది హంతా పేష్కస్ మాఖీ యిస్తావ్ బోల్తా హాభొబ్లీరాజాఖి షాల్కొండమన్నె ష్మే జావ్ హుకుం దేదియ్యా భొబ్లీవాడూ మన్కి హల్లచ్ఛం సెప్పి హుజూర్ భేటిక్ ఆతానై హాంద్కు హెట్లాగా 'వాణ్ణి ఖోట్కి తప్పు. హీరాజాషాహాంమే మన్మ భొబ్లి ఖోట్కిపోతే మన్కి సాలా షిబ్బంది మర్గయా హైతుంది. (చెవిలో రహస్యముగ) యీహిజ్యనగ్రం వాడూ వాభొబ్లీవాడూ యిద్రూ హేకం హై మన్మిద్కి లట్ పట్ కీ సెష్తే మన్కి షాలా ఖష్టం హైతుంది. హీళ్లయిద్దర్కి లోపల్ జట్టీత్మే హున్నాయ్ హాయ్యి మన్కి షాలా వుపోగ్యం. హంతాసామ్మ హూక్టేసారి నబాబ్ వారీఖజానామె మన్మ సెల్లిస్తే మన్కి సాలాన గ్జానా యిస్తార్.

బూసి.—(ఆలోచించి) సరియే ముందుగ నాబొబ్బిలిరంగారాయని మమ్ముఁ గనిమికోటమకాముళోఁ గలసికొనవలసిన దని కబురంపుము.

హైద.—యేల్నివార్ది హుకుమ్. (తెరపడును.)



శ్రీ ర స్తు.

ఓంనమో మార్తండగురుపరబ్రహ్మణే.

# శూ ర బొ బ్బి లి.

---

## ద్వి తీ యాం క ము.

రంగము-రంగారాయనికొల్వుకూటము.

రంగారావు, వేంగళరావు, ధర్మారావు, వేంకయ్య, బుచ్చన్న-యుందురు.

రంగా.—మామా! ఇంక వివాహముహూర్తము పదిదినము లున్నదికదా! మీ రిట్లుపేక్షించినచో నప్పుడు కార్యము మఱింత కష్టముగ నుండు నే! పౌరుగారివా రుండుట కెచ్చటెచ్చట విడిదు లేర్పఱిచినారు?

ధర్మా.—వారి కనుకూల మగు తెఱఁగునఁ గొందఱకు ధర్మసత్రంబులను, మఱికొందఱకు సంస్కృతపాఠశాలయందును, ఇంకఁగొందఱకు వేదాధ్యయనమందిరంబునను బస లేర్పాటు గావింపనెంచితి. అవి చాలక పోయినచో గోపాలస్వామివారియాలయముకూడ విడిదిచేయుదును.

రంగా.—దమ్మయ్యగారూ! నా కదేమికారణముననో కాని, ఇది యంత యుత్సాహజనకముగ నుండక మఱియొకమాదిరిగ నున్నది. నామనమది యేమో కీడునే శంకించుచున్నది. మన మెవ్వరి కేదేని యపకారము చేసియుండముకదా!

ఉ. పెద్దల భక్తిఁ గన్గొననొ? పిన్నలఁ గూరిమిఁ జూడనో? హరిక్ష
దక్షయుఁ గొల్వనో? ఖలుల దండన వెట్టనొ? భూసురావళి
న్నొవ్వఁగఁ జూచినాఁడనొ? యనుంగులనోమనొ? ఎందుచేత ని
ట్లుద్ధతిఁ దపించెడినయో! హృదయంబు ప్రతిక్షణంబహా!

ధర్మా.—గోపాలకృష్ణా! ఈ వివాహప్రయత్నముల యలజడిచే నీమన మిట్లు తొందరపడుచున్నది కాని యొండేమియుఁ గాదు. ఇంతకును నీ వెవరెఱుఁగనిపనిఁ జేసితివి? ఇంచుక విశ్రాంతిఁ జెందిన సర్వము కుదుటఁ బడఁగలదు.

రంగా.—మామా! కారణ మేమయి యుండునో తెలియదు కాని,—

క. వామాక్షి మాటిమాటికి
నేమో యదురందొడంగె నేయశుభముల
య్యో! మూఁడునో? బొబ్బిలిపురి
కేమేనియు వన్నె చెడునో? ఎటు లెఱుఁగ నగున్? ౨

మఱియు హృదయము గందరగోళ పడుటతోఁబాటు వామాక్షి యశుభము సూచించుచున్నది. ఒకవేళ నాకుఁ గీడు మూఁడినచో నా యీముద్దులతమ్ముని నెవ్వ రాదరింతురు?

వేంగ.—అన్నయ్య దొరా! ఇట్లధీరాలాపము లాడెదరేల? ఇది ధీరగుణమగునే?

మ. జనముల్ భీతిల సర్వలోకములు నాశంబైన వారాసు లె
ల్లను నొక్కుమ్మడి నింకిపోయినను లీలన్ దారకల్ డుల్లియా
యినచంద్రుల్ గతితప్పినన్ బృథివిలో నేమైన శ్రీరంగరాడ్
జనపాలాగ్రణికాలిగోటి కయినన్ శంకింపఁగా నేటికిన్? 3

సేవకుఁడు.—(ప్రవేశించి) మహారాజా! చామర్లకోటనుండి యొకచారుఁడు వచ్చి దేవరదర్శన మభిలషించుచున్నాఁడు.

రంగా.—నిరాటంకముగఁ బ్రవేశపెట్టుము. (సేవకుఁడు నిష్క్రమించుచును.)

చారుఁడు.—(ప్రవేశించి) దేవా! విజయ మగుఁగాక! మొన్నటిదినమున సీతాద్రి రాయనింగారిని దమ భేటీకి రమ్మని పరాసులయొద్దనుండి వార్త ...ఁగా వారు రాజమహేంద్రవరము దయచేసిరి. అందేమి విశేషములఁ ...ని పెట్టియున్నారో నాకుఁ దెలియదు కాని, వారక్కడనుండి వచ్చి

తమ కతిత్వరితముగ నీకమ్మ నందిమ్మని చెప్పి నన్నంపియున్నారు. ఇదే వారనిచినజాబు. (కమ్మనిచ్చుచున్నాఁడు.)

రంగా.—వెంకయ్యగారూ! ఆజాబందికొని యం దేమున్నదో చదువుఁడు. ఇంతసత్వరగతి నన్నగారియొద్దనుండి జాబు వచ్చుట చూడఁగా నేదియో యవశ్యకారణ ముండితీఱవలయును.

వేంక.—(జాబందికొని చదువును.) "శ్రీమద్గోపాల చరణారవింద సేవామకరంద బంభరాయమాణ మానసులును, శ్రీపద్మనాయక వంశనాయకమణులును అగు [illegible] రావు గోపాలకృష్ణ రంగారావుబహద్దరువారికి:— అన్న నీలాద్రిరాయఁ డాశీర్వచన పురస్సరంబుగ వ్రాయులేఖార్థములు.

ఈనడుమ జమాబందీ యొనరించుటకయి, నవాబుగారిచే నియమితుండయిన బూసీదొర వచ్చి రాజమహేంద్రవరంబున విడిసియున్నాఁ డని నీవును వినియేయుందువు!

రంగా.—అగును. ఆ బూసిదొర భేటీకి పోవలయు ననియు, పోయి మన కష్టసుఖములు చెప్పి మన మీవలయు కప్పము మాఫుచేయించుకొండమనియు, వారు మాఫుచేయనిచోఁ గొలఁదిసేనలతో నున్నవారలతో యుద్ధము సేయుట సుకరము కనుక సమరము చేయ మనలఁగూడ రమ్మనియు మొన్న విజయరామరాజు కబురంపియున్నాఁడు. అదియుఁగాక మనలను దమభేటీకి రమ్మని యీనడుమ వార్తఁగూడ నంపియున్నారు. ఆబూసియే యీబూసి కాఁబోలును? సరియే! ఆ పయి సంగతులఁ జదువుఁడు.

వేంక.—"పరంగివారమితసైన్యముతో వచ్చియున్నా రని విని మీసహజవిరోధి యగు విజయరామరాజు కొంతపరివారముతో రాజమహేంద్రవరమున విడిసియున్న బూసిదొరను దర్శించి యాతనిమంత్రియు దుర్నీతివర్తనుండును లంచగొండియు నగు హైదరుజంగును గలసికొని వారలకేమిదుర్మంత్రములు బోధించినాఁడో కాని,—

వేంగ.—(కోపముతో) ఔరౌరా! రాజకులార్ణవబడబానలమా! పిఱికి పందా! మీవంశమ్మునకెల్ల నపయశోదాయకం బగుపనిఁ జేసితివి కదరా?

క. మాపై ననికి వెడలలే
కీపగిదిని తురకఁ జేరి యెటో కొండియముల్
వే పలికి వాని నిట్టులు
మాపయి కెత్తింపఁ జూతె? మానవపశువా! ౮

నీవు వేయేండ్లు తలక్రిందుగఁ దపస్సు చేసినను, మఱికొన్ని జన్మము లెత్తినను బొబ్బిలివారిని గెలుచుపాటి సామర్థ్యం బాతమ్మిచూలి నీ మొగంబున వ్రాయఁడురా! నీవి ట్లసూయచేఁ జావక యేల గింజుకొనియెదవు?

రంగా.—తమ్మయ్యా! నీ దుడుకుఁదనముచే బ్రదుకఁజాలకున్నామోయి. వారినిఁ బూర్ణముగా నాయుత్తరమేని చదువనీయకున్నావుగదా!

వెంక.—"బోధించినాఁడో కాని, ఆ పరాసువారందఱును మీపయిఁ గడు కోపము నూని మిమ్మెదురింప నెంచుచున్నా రనుమాట నిశ్చయము. ఆరాజేమో హైదరున కమితధనము లంచ మిచ్చెద నని పల్కెనఁట! ఆతురకయును బొబ్బిలి గెల్చి వాని కిచ్చెద నని కత్తిఁ గొట్టి ప్రమాణము చేసినట్లు తెలియవచ్చినది."

రంగా.—తమ్ముఁడా! వేంగళరాయఁడా! సదస్యులారా!

శా. బద్ధస్పర్ధకదాత్ముఁ డావిజయభూపాలుండు మాపైని తాఁ
గ్రుద్ధత్వాంచితమానసుం డగుటచేఁ గొండెమ్ములం జెప్ప స
న్నద్ధంబౌ నిజవాహినిం గొనుచు నన్యాయమ్ముగా నీదొరల్
సిద్ధమ్మైయని సేయ నెంచిరఁట! ఇస్సీ! వింటిరే వింతలన్. ౯

వేంగ.—అన్నయ్యగారూ! అన్నిఁటి కేమిగాని,—

ఉ. పౌరుషశాలు లీవెలమవా రని లెస్సయెఱింగియున్న భూ
దారుఁడు రామరా జెటులు తా మనపై నని సేయ నెంచెనొ
యారయరాదు మున్ను తన సైనపరాభవనామకాగ్ని చ
ల్లారెనొ? బందెదర్ప్రతిఫలమ్ముగ నీగతి సేయ నెంచెనో?

రంగా.—ఏమీ! మన ప్రతిపక్షుఁ డగువానిమాయమాటలు విని సత్యాసత్యములు విమర్శింపక యాశూరులు మనపై నుద్రేకింప నెంచిరో? వారల బలంబులబలంబులు విని యీరంగారాయఁడు భీతిపడు నని యెంచిరో కాఁబోలును? పోలు!

చ. జనములు భీతిఁ జెందఁగ రసాతలవారిధు లేకమైన[illegible]
న్నన సతి తమ్ము లాప్తులు వినాశము నొందిననైన సద్యశో
ధను లగు రావువంశజులు ధర్మవిరుద్ధము లైన కార్యముల్
కనిసహియింత్రు రేయునురు కంఠమునంగలయంత కాలమున్.

బుచ్చ.—ఆవిజయరామరాజు మనలఁగూడఁ దన్నుంబోలె భీరువు లని యూహించి యుండుటచే నిట్లు చేసియుండును. కానిచో నిట్టి పిఱికిపని సేయునా!

మ. బలవంతుం డగు నేని శత్రువులఁ గూల్పవచ్చుఁ గాదేని వా
రలతో మిత్రత నుండవచ్చు ఋజుమార్గ మిట్టులుండంగ నీ
కులవిధ్వంసకరుండు వారలను గన్గొఁబోయి మాపైన ని
ట్టులుకొండెమ్ములువల్క నేమిటికిదుష్టుండా [illegible]డై.

రంగా.—ఎట్లుగా దైవము నిర్ణయించియున్నాఁడో అట్లు కాకమా[illegible] కదా!

శా. కానిమ్మేటికిఁ గా దనన్ వలయు? సంగ్రామమ్మునన్ వైరిరా
జ్ఞానాశస్త్రవితానసై పుణియు మనైఽపుణ్యముం గాననా

నానాఁ డావిజయతిమ్మేశుఁడు మదీయాస్తోక బాహాబల
మ్మెన్నిన్ లెస్సయెఱుంగఁగాఁగలఁడుసుండీ! పెక్కులిం కేటికిన్?

వెంకయ్యగారూ! ఆజాబు తుదముట్టఁ జదువుఁడు.

వేంక.—"దీనింగూర్చి మీరు బాగుగ యోజించి వలయుప్రయత్నముల నుండవలయు. ముం దేమిజరుగఁబోవునదియుఁ దెలియఁజేసెదను.

చామర్లకోట,
జనవరి 1757.

మీ హితాభిలాషి,
నీలాద్రిరాయనింగారు.

రంగా.—ఓయీ! నీ వీకఁ జామర్లకోట కరిగి అన్నయ్యదొరగారితో "మీరు కావించినమహోపకారంబు నెన్నటికిని మఱవ మనియు, సామమునఁ గార్య మెటులేని సాధించెద" మనియు మనవిసేయుము. బుచ్చన్నగారూ! ఆతనికిం దగుబహుమతు లొసఁగి సత్కరింపుఁడు.

బుచ్చ.— చారుని సంభావించి మరల (ప్రవేశించును.)

రంగా.—వెంకయ్యగారూ! మీరొకసారి పోయి బావయ్యగారిని బిలిచి కొనివచ్చెదరా! అందఱముఁగూడి కార్యము నిర్ణయింతము.

వెంక.—చిత్తము. (నిష్క్రమించును.)

రంగా.—అన్నలారా! వింటిరి కదా! అన్నగారు దయాపూర్వకముగ మన కనిచినకమ్మ. సమయము వేచి వేచి మన మందఱ మప్రమత్తుల మయి యుండి పిఠాపుర ప్రయత్నము లొనరించుకొనుతఱి వలను కనిపెట్టి మనవైరి యగు విజయరామరా జెట్టియుపాయముఁ దెచ్చిపెట్టినాఁడో! శతఘ్నికానికాయపరివృతులగు నాపరాసువారితో యుద్ధమునకే డీకొంటిమా యుద్ధాగ్నిలోఁబడి మన మెల్లరము మలమల మాఁడుదు మేమో? ఇందుల కుపాయ మేమి?

వేంగ.—అన్నయ్యగారూ! మీ రేటి కిట్లాడెదరు? మీయాజ్ఞఁ బాలింపుచున్న మే మందఱముఁగూడ నేమైతిమని యింత వెలితిగ యోజించు

చుంటిరి? ఆవిజయరాముఁ డా హైదరుబూసులనే కాక మతియొక్క వేయికోట్లమందినిఁగూడ కూర్చికొని రానిండు.

మ. వెలమల్ నా నెవ రంచు నెంచితిరి? దోర్వీర్యప్రతాపానల
జ్వాలనజ్వాలలసర్వలోకములు గాల్పఁగ లేరె? యేనొక్కఁడఁగ
గలనఁగ హైదరుబూసుల న్గెడపి వీఁక న్మత్ప్రితాపంబు నా
జలజాతాప్త హిమాంశుతారకముగా స్థాపించెదఁగ సోదరా!

అట్టివార సేన లుండ నీక విజయమునుగూర్చి శంకింప నేటికి? విజయ సూచకంబుగ రణభేరి మ్రోయించి సర్వసేనల నుసమరసన్నద్ధముగఁ జేయక యింక నీజాగేల? ఈయోజ యోజన లేల?

ఆ. వె. వెలమవారి చెంపప్రవే ట్లెంగినవాఁడు
విజయరాముఁ డొక్కఁడె వీరి గెలుతు
నంచు వచ్చినట్టి హైదరు బూసియు
నెఱుఁగఁగలరు వెలమయీఁటెపోటు. ౧౧

ధర్మా.— అల్లుఁడా! యుద్ధము యుద్ధ మని పలువరించెద వేల? అదియు నచిరకాలములో డాయ నున్న దేమో కదా! సామ దాన భేదోపా యంబుల నిది చక్కఁబఱుపవలె నని ఈయెల్లరియుద్దేశ మగుచుండ నీ విట్లు యుద్ధమున కుతికెద వేల?

వేంగ.—(ఈర్ష్యతో) మీయభిప్రాయ మెప్పుడును సామమువంకనే వెన్నఁగులాడు చుండును గాని యుద్ధమునకు ముందంజవేయునా? మన యెడల నిరత మహాద్రోహము సేయ సమకట్టిన యానీచునియెడల సామ మనుసరింపవలె నేమి?

చ. ఎపుడు లభింతుఁ గాల మని యెంచుచు వేళ లభించినంత నా
కపటనృపాలుఁ డాదొరలఁ గైవసముగ బొనరించి యిట్టులా
లపుఁబని కుద్యమించితమలమ్కఁరు తోడ్కొని వచ్చుచుండ నె
య్యపుఁబనసమాపనుంటిరిబళా! కడునబ్బురమయ్యె నియ్యెడన్

నృపాపసదుం డగు నా విజయరాముని దురాలోచన విని, వల్లెయని తల యూఁచి బొబ్బిలిపయి డీకొనెంచిన యాముష్కరతురుష్కాధములతో నింకను సంధి ననుసంధింపవలయు నేమి ?

(తెరలోఁ బాపారాయఁడు.)

శా. దండన్దండిమగండు వేంగళుఁడు ప్రోద్దండక్రియన్యాయమై
యుండన్భండనభూమి మెండుకొని యుద్ధోత్సాహమే పారబ్ర
హ్మాండమ్మెల్లను గుండపిండిగను జేయంజాలు పాపయ్య యిం
దుండన్గొండరిరామరాజనికిఁ దానూహించెనే మాపయిన్.

పాపారాయఁడు.—(పటాక్షేపముగఁ దెరఁ జిమ్మికొని ఆగ్రహముతోఁ బరవళ్లు ద్రొక్కుచుఁ బ్రవేశించి విజయరాముఁ డెదుటనున్నట్లు లక్షించుచు.) ఓరీ ద్విపాదపశువా ! విజయరామహతకా !

స్రగ్ధర.

సంగుల్ గింగుల్ దురుష్కుల్ జతనపఱిచి వే సంగరమ్మాచరింతే?
ఖంగాళీ! దుష్టచిత్తా! కలుషహృదయ! దుష్కర్మ! తంత్రాభిలాషీ!
రంగారాయక్షితీశాగ్రణి యున నెఱుఁగన్ రాదురా? మంచిదే! యే
న్నంగిన్ మత్ఖడ్గధారార్భటికి నిలిచెదో? వచ్చిచూతున్ దురాత్మా!

వేంగ.— బావా ! చూచితివా ! దురాత్ముం డగు విజయరామరాజు చేయుచున్న దుస్తంత్రము ! తా నందిన పరాభవంబునకు చావక యెవ్వరినో బూసిదొరను, హైదరుజంగు సాహేబును దోడుకొని మనపైకి యుద్ధమునకు వెడలుచున్నాఁడఁట !

పాపా.— నిజప్రతాపానలంబునఁ బరిపంథిసేనాసాగరంబు నింకింజాలు పాపారాయఁ డిందున్నాఁ డన్నమాట యావిజయరాముఁ డప్పు మఱచిపోయినాఁడు కాఁబోలు ! తగుదుమని వారలకు బాసట రా చిన యాతురకలను దూదేకులును, ఇంక మఱెంత ప్రదర్శిత

వలంబునకు శలభంబులు కాఁగలరు. ఏఁడీ! ముందాబలగర్వితుం డెం దున్నాఁడో నాకు చూపింపుఁడు. ఏనొక్కరుండన ఛురికామాత్ర సహాయుండనై వానిగర్వంబు సర్వంబు ఖర్వంబు గావించి మీకు నేత్ర పర్వం బొనరించెద.

రంగా.—ఓ వీరపుంగవులారా! శాంతింపుఁడు. శాంతింపుఁడు. మీకోప మూలంబున మాయాలోచనల కంతరాయము కల్పించుచున్నారే!

క. కర్జ మెటు సేయనగునో ?
తర్జనభర్జనలు సేయఁదగు నని పిలువన్
వర్జితశాంతుల రై యిటు
గర్జించుట లెస్సయే ? వికాసము వలదే ?

పాపా.—బావా! బ్రాహ్మణులకువలె మాకుఁగూడ శాంతిపన్నము లుప దేశించెద వేల ?

ఉ. హైదరొకండె కాదు జగమంతయు నాలము సేయవచ్చినన్
కాదననేల? వారిబలగర్వము సర్వము రూపుమాపి భూ
మీదయితుల్ భవత్పదసమీపమునం బడవైవఁ జాలనే?
మీదయయింతయుండిన నమేయపరాక్రమ! రంగరాణ్ణృపా!

రంగా.—బావా! వారు మనపైకి దండువెడల నున్నారనుమాటమాత్ర మేమినిశ్చయము! అక్కడఁ బ్రవర్తిల్లినసంగతి నన్నగారెఱింగినంత వఱకు వ్రాసిపంపినారు. అంతమాత్రమున వారలకృతనిశ్చయము స్థిరీక రించుట కెట్లు వలనయ్యెడిని? మన మేమిసేయవలసినదియు నిర్ణయించి కొనుటకు నిన్నుఁ బిలువనంప నీవిట్లుకాండతాండవ మాడమొదలిడితివి. ఇట్లుగ తొందరపడుట యుచిత మగునే?

పాపా.—బావా! విజయమగుఁగాక! అరిసేనలు మనలం దాఁకనున్న వని వినినంత జనించినయలుకచే నేమేమియో యంటిని. అందులకయి యిందఱివా రెల్ల మన్నింతురుగాక:— బావా! నావలన కాఁదగు కార్య మేదియో యానతీయ వేఁడెద.—

సేవకుఁడు.— దేవా! ఎవ్వఁడో యొకతురకజవాను హైదరుజంగుదగ్గఱ నుండి దేవర కేదియో వార్తఁదెచ్చినాఁడఁట!

రంగా.— నిరాటంకముగఁ బ్రవేశపెట్టుము.

పాపా.— బావా! విజయరాముఁ డిచ్చినలంచముచే నోరు మెదల్పఁ జాలని యాహైదరు మన కేటి కిప్పుడు వార్తనంపవలయు? ఇదియొక కృత్రిమ మేమో!

వేంగ.— కానిమ్ము! ఏల కాకపోవలయును? ఏ కృత్రిమము పచరించినను వారు మనల నేమి చేయఁగలరు?

ధర్మా.— వా రంపిన సందేశము సాంతముగా వినినచో నంతయు మనకే తెల్లమగును.

తురకజవాను. (ప్రవేశించి) సలామ్! బొబ్బిలియేలే రంగ్రావ్ బహద్దరువార్కి! మాదీ యేల్నాహాడూ హుంది బూసీధోర్! హార్ది మీఖీ యీతాఖీద్ సే హిచ్చిరమ్మన్ బోలే! హిద్గో సాబ్! తాఖీద్ మే దేఖో! (తాఖీదు నొసఁగును.)

రంగా.— వెంకయ్యగారూ! దానియం దేమున్నదో చదువుఁడు.

వేంక.— (తాఖీ దందుకొని చదివి) సరియే; బూసిదొరగారిని స్వయముగ ఖాసింకోటమకాములోఁ గలసికొనవలసిన దని తాఖీ దంపియున్నారు.

రంగా.— ఓయీ! వచ్చి వారిదర్శనము చేయుదు మని మనవిచేయుము. నీవు కడు మంచివానివలెఁ గన్పట్టుచున్నావు. నీకు బహుమతి యొసంగెదము. విజయరాముఁ డిప్పు డెచ్చట నున్నాఁడో చెప్పఁగలవా?

తుర.— హాడూ హిజ్యారాజామే మాదీ హైదర్ జంగ్ తో ఖల్సి వుంటాడ్; హారూ హంతా మంత్రాంగం షెప్తార్.

రంగా.— అయినచో మీదొరలయాలోచన మేదియో తెలియునా?

తుర.— మాఖీ తెల్యాద్ ఖానీ మీఖి మార్నే కు లడాయ్ఖి సెప్తామ్ హాలోస్న సేస్తార్ హుంది సాబ్; హాడూ హుందీలేదూ హైదర్; హాచ్చాపుండాకోర్ బద్మాష్ వుంది. హాడ్కి రాజావాలామే బారా లాక్ రుఫియా లంచం హిచ్చాడ్; హంతా పుఖార్.

రంగా.— బుచ్చన్నగారూ! మీ రీతని సబహుమానముగఁ బంపిరండు కర్తవ్యము నిర్ణయింతము. (బుచ్చన్న తురకసహితముగ నిష్క్రమించి తిరుగ ప్రవేశించును.)

రంగా.—అయ్యలారా! ఇప్పుడు మన కన్నయ్యదొరగారు పంపినవార్తయును, బూసిదొరగారు పంపినతాఖీదును వినియున్నారు కదా! ఇటుపైని మన మేమి సేయవలయును?

ధర్మా.— గోపాలకృష్ణా! దుర్ఘటమైన యిట్టిరాజకీయ వ్యవహారములు తటస్థించినపుడు మిగుల యోజించి యే దేనిఁ జేయవలయును కాని; తొందరపడి యేది చేసిన నది విషమముగఁ బరిణమించును. మనము బాహుబలము కలవారమే యైనను; మాయాయుద్ధకుశలు లగుపరాసువారితోఁ బోరుటజే జయంబు మనకో ప్రత్యర్థులకో నిర్ణయింపఁజాలము. అట్టియెడ నీకార్యము సామమున నే చక్కఁబెట్టికొనవలయును. బూసిదొరవ్రాసినచొప్పున నతనిఁ జేటికిఁ బోయినచో సర్వము నిర్వహింపఁగల మని నాయభిప్రాయము.

వేంక.— అట్లయినచో మంచిదియే కాని; లంచగొండియగు హైదరు విజయరామునిచేఁ బ్రేరితుఁడయి మనల నేమేని యవమానపఱచు నేమో?

బుచ్చ.—వెంకయ్యగారియూహ కూడ త్రోసిపుచ్చుటకు వీలులేదు. అందుచేతనే గదా! వారి తొలివర్తమానమునకు మనము రాజమహేంద్రవరమునకుఁ బోలేదు. న్యాయాన్యాయములు, యుక్తాయుక్తములు ధనైకపక్షపాతుల కుండునా?

పాపా.— (కోపముతో) ఏమేమి! నిజప్రతాపకల్పాంతాంబరచుంబిత జాజ్వల్యమాన జ్వాలాసమావృతశిఖిదందహ్యమాన మత్తపరిపంథిసర్వసేనావార శుష్కేంధనుం డగురంగమహీపాలునకే యవమానమా? అట్లొనరించివాఁడే చెఱువునీరు త్రాగఁగలఁడు?

శా. ఔరా! యెంతటిమాటలాడెదరు? నాకాధీశుఁడైనఁగాక! విస్ఫారోగ్రస్ఫుటబాహాదర్పవిజితప్రత్యర్థి యైనట్టి రం

గా రాయప్రభువాళి వచ్చినను చుల్కఁజేయునే? అట్టుల
వ్వారల్జూచినవారిప్రాణములునిల్వఁజాలునే బొండెలోఁ.

ధర్మా.— అంతదనుకఁ బోనేల? సాయమునఁ గార్యము నిర్వహింపనెంచు వారి కిది కర్తవ్యము కాదు. ముందుగ నాదొరలయొద్దకు మనము పోవలయు.

వేంక.— మీరు దొరలనుటచే జ్ఞప్తికి వచ్చినది. మనరాయనింగారినిగూర్చి విశదముగ నెఱిఁగిన కుముందరుదొరగారు మన కిప్పట్లు సాయము చేయలేరా? వారుకూడ దొరలేకదా!

రంగా.— అగును. కుముందరుదొరగారు మన కిప్పట్లు సాహాయ్యము చేసియే తీరుదురు. వారిదగ్గఱకు ముందుగ మనము రాయబార మంపుదమా?

వేంక.— పంపవచ్చును కాని; ఆరాయబారపువిశేషము లేమని?

ధర్మా.— ఏమున్నది? ఇచ్చటిసంగతు లన్నియు ఉన్నవున్నట్లు నివేదించి మనలనుగూర్చి బూసిదొరగారికి వ్రాసి యుద్ధమాఁపవలయునని.

రంగా.— ఇదియే కడు మంచియుపాయము. బుచ్చన్నగారూ! మీరొక సారి మమ్ముంగూర్చి శ్రమఁ దీసికొని బందరుపురమునకుం జని కుముందరుదొరగారిని జూచి మనసంగతి నివేదించి వచ్చెదరా? మరలి వచ్చుతఱి మీరు స్వయముగ బూసిదొరగారియొద్దకుఁ బోయి వాస్తవముఁ దెల్పి రండు. సర్వవిధముల యుద్ధమాఁప యత్నింపుఁడు.

బుచ్చ.— దేవా! మీసందేశముఁ గొని పోవుటచే నే నిన్నాళ్లకు ధన్యుఁడనైతిని. కుముందరుదొరగారి కాబూసిదొర స్నేహితుఁడును శిష్యప్రాయుఁడునఁట! ఇఁక సంధి పొసఁగుట కేమిలోటు?

రంగా.— ఎంతసొమ్ము వలసినను తృణప్రాయముగ నిచ్చెద మని చెప్పి యొందులకును వెనుకఁదీయకుఁడు.

బుచ్చ.— చిత్తము - (నిష్క్రమించును.)

ధర్మా.— రాయబార మంపితి మని మన మిపు డేమఱి యుండఁజనదు. అన్ని సన్నాహములమీఁద నుండినచో బాగుగా నుండును.

రంగా.—ఇప్పట్లు చేయవలసిన సన్నాహము లేమి? సేనలన్నియు సిద్ధముగనే యున్నవికదా!

ధర్మా.—అట్లుకాదు. వారొకవేళ మనవర్తమానము చేరకమున్న బొబ్బిలి ముట్టడింపనెంచిరేని మన మానడుమం బడి ప్రగ్గవలసినవార మగుదుము. కావున కొంతసేనం దోడొసంగి పాపారాయని రాజాముకడ నుంచినచో మనకు మున్ముందు వార్త తెలియుటయేకాక వారి నచ్చటనే యడ్డగింపవచ్చును.

రంగా.—బావగారి నిపుడె విడిచిపుచ్చుటకు మన మొప్పకున్నది. శత్రుసేనామధ్యంబున వారొక్కరు.—(అర్ధోక్తిలో)

పాపా.—తిరస్కారసూచక మగుకోపముతో

శా. భావా! ఎంతటిమాటలాడితివి? పాపారాయఁడన్నన్ స్వతే
జోవైశ్వానరుఁ డంచు నెంచవకటా! క్షుద్రాత్ములౌ వీరిదా
లావెన్నంగ నదెంత? రుద్రుఁడయిన న్లక్ష్యమ్మె? వీక్షింతు నే
నీవాజమ్ముల తేజ మెంతటిదియో? యేలా! యిటుల్శంకిలన్?

క. దారిఁ జనువేళ నేన
వ్వారల వడిఁ దాఁకి వారిబల మారసి వే
మారిమసంగినమచ్చున
నారిపులం జంపువాఁడ నవనీనాథా! ౧౮

రంగా.—ఇది కడు లెస్సగ నున్నది. ప్రకృత మిట్లు జరిగించి యవసరమగుతటి నిచ్చవచ్చినట్లు చేయవచ్చును. నేఁటికిఁ గొల్వు చాలింతము.

(తెర దిగును.)

రంగము బూసిదొరడేరా

బూసి - హైదరుజంగు - విజయరామరాజు నుందురు.

బూసి.—ఏమోయి విజయరామరాజా! అప్పుడే బొబ్బిలివారి నిందురమ్మనికబురంపి చాలదినములైనది కాని యింకను వారిందు వచ్చినజాడ కానరాలేదు. నీ వనినది నిక్కమయి యుండునాయేమి?

విజ.— నే నెన్నఁడయిన సర్కారువారితో నమ్రతము మనవిసేయుదునా? మీవార్తలే దండుగలు కాని; వారెన్నఁటికిని మీభేటీకి రారనుమాట నిశ్చయము.

హైద.— వోరూ భలేషిపాయీలుగదా! మందీభేట్కు వోరు ఆతా హైతే ఖొబ్లీఖి హావ్మానం హైతుంది నాఖీ తోస్తాది. రాజాజీ తమ్రూ క్యాబోల్తావ్?

విజ.— ఎవరు చెప్పుట కేమున్నది? మీరును వచ్చుచున్నా రనువార్త వినినంతనే వారుకూడ యుద్ధసన్నద్ధు లగుచుందురు. యుద్ధరంగమున మిమ్ములను గలసికొనవలయు ననియే కదా! వారియభిమతము.

బూసి.— ఔఁడా! మాటిమాటికి వాఁడు మాతోఁ గయ్యము సేయఁగలఁడని చెప్పుచున్నావు. వాని కంతబలము కలదని నీవు దిగులుపడియెద వేమో కాని; మా కది యొక లెక్కయే! మాపొగగుండుగొట్టముల ముట్టించినచో బొబ్బిలి యంతయు నొకనిముసములో దిబ్బయయి పోదా! నీ కింకను మాగుండుదెబ్బ తెలియదు కాఁబోలును?

విజ.— మీగుండుదెబ్బలకన్న వారియీఁటెపోటులే యెక్కుడని వారూహించుచున్నారు.

హుస్సేను.— (ప్రవేశించి) హుజూర్! మచ్లీబందర్‌వుందీ లేదూ! హడ్డా నించి మీదీభాయీసాబ్ బుసుందర్ దొర్గారిథగ్గా—కోఁరే!— మార్తెన్, మార్తెన్ భాయీ ఆయా.

హైద.—(తనలో) మార్తెన్ ఆయా? హంతా ధూరంనించి బుసుందర్ దోర్ హిడ్డాకి పంప్తాన్కు క్యాజరూరత్? హామ్కు మాలుంనహీ! హిది యిన్నాథగ్గానించీ మేరాదిల్ హంతా లొటూకు లొటూకు ఖొట్టుకుంటా హుంది.

విజ.— (తనలో) బొబ్బిలిరాయుం డీబుసుందరుదొరకుఁ గడుఁ గూర్చ స్నేహితుండు. వారలప్రేరణచే నేమేని యీమార్తెను వచ్చియుండఁడు కదా!

గీ. కటకటా! మత్ప్రియత్నభంగ మ్మొనర్ప
వచ్చెఁగాఁబోలు మార్టైనుఁ డిచ్చటకును
కాకయుండిన బందరుగ్రామవాసి
యితని నిచటకుఁ బంపింప హేతువేమి? ౨౦

ఆరంగారాయని కిది తెలిసి కుముందరుదొరకు వర్తమాన మంపియుండ నోపు. ఈసందేశము వినినపిదప బూసిదొరయభిప్రాయము మార్చుకొనునేమో! ఇందుల కేదేని యొకప్రతిక్రియ యాలోచింపవలయు.

బూసి.— ఏమీ! మా చెలికాఁడగు కుముందరుదొరయొద్దనుండి మార్టైను వచ్చియున్నాఁడా! వానిని లోనికి రానిమ్ము-(హైదరుతో) అయ్యా! మీగుడారములకు మీరు పొండు. మేము వారితో మాటలాడవలయును.

హైదరు విజయరాముల నిష్క్రమణము.

మార్టైను - బుచ్చన్నల ప్రవేశము.

మార్టైను - బుచ్చన్న.—సలామ్! బూసీదొరగారికి.

బూసి.— (సలామందుకొని) మార్టైన్! ఆకుర్చీపయిని కూరుచుండుము. నీతో వచ్చినయతనిం గూర్చి నాకుఁ దెలియదు. వారి నాకుర్చీపయిని గూర్చుండఁబెట్టుము.

మార్టైను.—(ఆసీనుఁడయి) బుచ్చన్నగారూ! మీ రాకుర్చీపయిని గూరుచుండుఁడు.

బుచ్చ.— (ఆసీనుఁ డగుచున్నాఁడు.)

బూసి.— మార్టైన్! మా చెలికాఁడు కుముందరుదొరగారచ్చట సేమముగ నున్నారా? నిన్నింత తొందరగ నాయొద్ద కంపనేల? అచ్చట మఱేమియు వింతలు లేవుకదా!

మార్టై.—కావలసినన్ని వింతలు కలవు. దొరగారు మొదలగువా రందఱును సేమముగ నున్నారు. మీకీజాబిచ్చి రమ్మని నన్నంపియున్నారు.

(జాబందిచ్చును.)

బూసి.— (తీసికొని చదివికొనకయే) మమ్మటకు రమ్మని యీజాబు వారు ప్రత్తెంచినట్లు తోఁచుచున్నది. ఈజమాబందీపని అంతయు చేసికొని యక్కడకు వచ్చెద మని చెప్పుము.

మార్టై.— మిమ్ములను జూచుటకంటెను తొందరకార్య మింకను వేఱొకటి కలదు. అది యంతయు నిందు వ్రాయించినారు. ఈకమ్మఁ దిలకించినచో మీకే యంతయు వెల్లడియగును.

బూసి.— (జాబు చదివి ఆశ్చర్యనిమగ్నుఁడయి) అబ్బా! ఎంత మోసము జరిగినది! ఈవిజయరామునిమాట లన్నియు నాసేమో యని నమ్మి బొబ్బిలి కేనిపయి దాడివెడలుటకు, మేము మందుగుండుసామాను సేకరించుచున్నాము. ఈయెకిమీనియొద్ద మిగుల లంచముఁగొని యీనక్కజిత్తులమారియగు హైదరు నాతో నెట్లుగ బొంకుచున్నాఁడు? బొబ్బిలి-విజయనగరములకుఁ గలప్రాఁతపగల నీఁగ నెంచి విజయరాముఁ డీమోసము చేయ నెంచినాఁడో?

మార్టై.— మీరు వారివలనో నప్పుడే పడిపోయినట్లు తోఁచుచున్నది. ఆ బొబ్బిలియెకిమీని మీ రొకసారి చూచినచో వాని మంచినడత యంతయు మీకే వెల్లడియగును. వీరి నాబొబ్బిలిరాయఁ డంపియున్నాఁడు. అంతయుఁ దమతో మనవిచేయఁగలరు.

బూసి.— అయ్యా! బొబ్బిలియెకిమీఁ డేల తనంత మాదగ్గఱకు వచ్చి చెప్పికొనక యిట్లు కుముందరుదొరగారిమూలముగఁ దెలియఁబఱిచినాఁడు?

బుచ్చి.— దేవా! పరాసుసార్వభౌమా! విజయరాముని మాయావాగురలో బంధింపఁబడిన మీరు తమ్మేమేని యవమానపఱుతురేమో యనుభీతిచే వారు స్వయముగ రాలేదు మన్నింపవలయు. వారు తమతో మనవిచేయు మనినసందేశ మిది.

క. చిరతరమునుండి మే మీ
సరకారు గ్రహించినాము జాగీరుగ, దే

వరవారు వేఱు చూచుట
పరమాధర్మంబు బుద్ధి భావింపంగన్. ౨౧

అదియునుంగాక:—

చ. పితరులవంటివారు మముఁ బెంచినవారలు మీరె యిట్లసూ
యతవహియింప న్యాయమగునా? పగవారము కాముగా! భవ
న్మతమును మాఱుఁదాలిచి క్రమమ్ముగ వర్తిలువారమెల్ల సం
గతులును మీకె తెల్లముగఁ గన్గొనఁ నా కొకయింత తాళినన్.

మఱియు:—

శా. మాకున్ వైరిగనున్న యావిజయరామక్ష్మావరుం డేమియో
మీకున్ జెప్పినయంతమాత్రమున నెమ్మిన్ వానినమ్మంగనౌ
నా! కౌటిల్యధురీణుఁ డాతఁడు మముల్ మన్నింపఁగా నొప్పున
య్యా! కామందులవారితో నెదురఁగా నాశింతు రేయెప్పుడున్

బూసి.— అయినచో మీ రీయవలయుకప్ప మేల చెల్లింపలేదు? ఏల యింత జాగొనరించితిరి?

బుచ్చ.— దేవా! మే మీయవలయుసొమ్మంతయుఁ దాము ముందఱమ కామునకు దయచేసినప్పుడు దమ్మిడియేని కొరవలేకుండ చెల్లింపఁగలవారము. పేష్కసుఁ జెల్లింపలే దని తా మిట్లు కినుకఁ బూనఁ జెల్లునా?

బూసి.— కుముందరుదొరగారు మాకిందు చాల మేలుచేసియున్నారు. వారు మా కిట్లు జాబు వ్రాసియుండకపోయినచో మే మెంతయేని కొల్లలాచరించియుందుము. తుంటరియగు నావిజయరాముని నుడు లగు నేమో యని నమ్మి బొబ్బిలిపయి దాడివెడల నుంకించితిమి. మాట్రెన్! వారింకే మేని చెప్పియున్నారా?

మాట్రె.— ఏమి చెప్పుట కేమున్నది? బొబ్బిలిపయికి దండు వెడలవల దనియు, వారు చాల మంచివా రనియు, ఇది యంతయు విజయరాముని పన్నుగడ యనియును చెప్పుమనినారు.

బూసీ.—మార్టెన్ ! నీవు వెంటనే పోయి దొరగారితో "మే మొనరించిన దంతయుఁ దప్పనియు, మీ రంపినకమ్మఁ దిలకించి దాడివెడల మానితి మనియు నుడువుము. నే నొకవేళ బొబ్బిలి కేఁగినను జమాబందీకయి వెడలెదను గాని యని సేయను. హైదరును జీవాట్లు వైచి మందలించెద" నని చెప్పుము. బుచ్చన్నగారూ ! మీరుకూడ మీ రాయనియొద్ద కరిగి యని మానితి మని చెప్పుఁడు. మిమ్మింత కలవరపఱచినందులకయి మమ్ము మన్నింపవలయు ననుఁడు. ఇంకింక మసలక వడిఁ బొండు. వెంటనే కప్పముమాత్రము చెల్లింపుఁడు.

బుచ్చ.—చిత్తము మా కిదియే వరప్రసాదము. (మార్టెను - బుచ్చన్న నిష్క్రమింతురు.)

బూసీ.—సేవకా ! విజయరామరాజును, హైదరును బిలిచికొనిరమ్ము.

హైదరు-విజయరాముల ప్రవేశము.

హైద.—(తనలో) బద్మాష్ రంగ్రావ్ మాఖి ఖబ్రూ సెయ్యక, తుముందర్ కి సెప్పి బుస్సీదొర్గారిక మామీద ఘుస్సా తెఛ్ఛాడ్ ! అచ్ఛా అచ్ఛా ! బుస్సీమే ఘుస్సా ఫిస్సా ఏక్ సణంలో తారీఫ్ సేసి, భొబ్లీ మీద్కి ధండూ యెల్కపోతె మాఖీ హిది మంత్రాంగం హెందుక్? సత్తర్ బుస్సీలుక, శత్తురుముందరుక ఖల్పి భోమ్‌లా హోటా సెయ్యక పోతే హమ్ హైదర్‌జంగ్ నహీ హై.

బూసీ.—(కోపముతో) టాటోటుకాఁడా ! నీ కీయెకిమీఁ దెంత లంచ మిచ్చియున్నాఁడు ? అది జేబులో వైచికొని మాతో దబ్బర పలికి మోసము చేయ నెంచుచున్నావా ? నీ విట్లు చేసినందులకు నిన్నేమి చేయింపవలయు ? ఔరా ! మోసము !

హైద.—హల్లా హల్లా ! మేం హేటీ సేసేమ్ సాబ్ ! మేం తమ్‌తోటీ హెందుక్ హబ్ధం సెప్తామ్. మాఖీ యేటి తెల్సు ?

బూసీ.—నోరు మూసికొనుము. ఇంకను కొండెమ్ములు చెప్ప నెంచుచున్నావా ? నీతలఁ దఱిగించివేసెద నుండుము. గొనములయిక్కయగు

నా బొబ్బిలిరాయఁడు తనకప్ప మెప్పు డడిగిన నప్పుడే చెల్లింప సిద్ధముగ నున్నాఁడే! అటువంటివానిపయిని చాడీలు చెప్పి మా కలుక రెట్టింతువా! మాయలాఁడగునీ తేనిమంచివాఁ డందువా! ఇది యంతయు మా చెలికాఁడు మాకు వ్రాసి పంపలేదా?

తురక జవాను.—ఏడ్చుచు ప్రవేశించి) మాఖీ భొబ్లీఖి హెంద్కు పంప్నార్ సాబ్! హోభొబ్లీహోదూ మాదీభీఖ్ హంతా షిద్గాయేస్నాడ్!

బూసి.— ఏటి కిట్లల్లరి చేసెదవు? నీ కేమైనది?

తుర.— హుజూర్! మీది ఫర్మానామే యేస్కోని మాఖీ భొబ్లి పోయి హోత్ని రమ్మంటే హోడ్ది తమ్మూ హుంది యెంగారాడ్డు సెప్తార్ బడే లాటీకి పట్కోని "బుస్సీ హెవ్డు? హోదూ రమ్మంటే మాఖీ యెంమ్కు వస్తావ్! ఖీదీబుస్సీ ఝూటాకోర్! బద్మాష్‌వుంగి. హోడ్కి సేతా హైతే లడాయికి రమ్మన్!" హంటూ ఘుందూ పట్కోని సిద్గా గొట్టేడ్ సాబ్!

బూసి.—హైదరూ! వీఁడేమి యిట్లనుచున్నాఁడు? అతఁడు కడు మంచివాఁ డని చెప్పుచు మనయొద్దకు కుముందరుదొర కమ్మ వ్రాసినాఁడే! తిరుగ నిట్లు చేసినాఁడేమి? వానికి తెలివి లేదా?

విజ.— మాటలు కడు మెత్తగనే చెప్పుచుందురు కాని క్రియాసమయము పట్ల వారు మిమ్ముఁ దిరస్కరించుచునే యుందురు! నా కెందుల కీయక్కఱకు మాలినగొడవ?

బుస్సీ.—తరువాత చూచుకొనవచ్చును. ముందు బొబ్బిలిపయికి దాడివెడలుటకు సామగ్రి జతనపఱపుము.

హైద.—సర్కార్! మాదీ బద్మాష్‌మాటా సెప్నార్! మేము బద్మాష్ వుంది- మాక్లీయుద్ధం గిద్దంవద్దు. తమ్‌దీ నౌక్రీఖి సలామ్. మాదీబాత్ హుజూర్కి ఇమ్కాం లేఖ్ పోతే లుచ్ఛానౌక్రీ! మాఖీ యెందూకు! మాఖీ సెల్వు యిండి. మాం పోతాం. (పోఁబోవును.)

బుస్సి.—వారిమాటల నమ్మి నిన్ననినందులకు నీవపుడే పోయెద నని చెప్పు చున్నావే! చాలు. చాల కోపము చూపితివి. దాడి వెడలుట కన్నియు జతసపఱుపుము.

హైద.— హేల్ని హోర్దిహుకుం హైతే భోబ్లీ హూక్క్షణంలో సాప్ సఫాయ్ సేసివేస్తామ్.

బూసి.— సరియే! నేను డేరాలోనికిఁ బోయెదను. (నిష్క్రమించును.)

విజ.— సాయెబేంద్రా! మీ రీజవానునకు లంచ మిచ్చి చెప్పించినమాటల చేత నేసుఁడీ! బొబ్బిలిపయి మరల: దొరగారి కంత యలుక పుట్టి నది. అదిరా! మీబుద్ధివిశేష మెంతయేని యిచ్చట కొనియాడఁదగి యున్నది.

హైద.— హిబ్యారాజా! మన్కిమాటల్కి హిది షమ్యం కాదు. మన్ము హోల్సం సెప్తే దొర్గార్కి మళ్లా హేంటి తోస్తాదో! రస్తు గిన్తా దరో బస్తూ తయ్యార్ సేస్తామ్; అవ్ మే భయ్యా! (నిష్క్రమింతురు.)

---

శ్రీరస్తు.

ఓంనమో మార్తాండగురుపరబ్రహ్మణే.

# శూరబొబ్బిలి.

---

## తృతీయాంకము.

---

### రంగము — పురోపాంతము.

—చెలికాని వెంకయ్య ప్రవేశించుచున్నాఁడు.—

వెంక.— ఆహా! ఇన్నినాళ్లకు నాజన్మము పావనమైనది. ఒక్క నాజన్మ
మే యన నేటికి? మావంశకర్తల జన్మములెల్లఁ బావనములైనవి. మా
రాజ్యపుటెల్ల యగు దేవుపల్లికిఁ బరాసువారు సపరివారముగ వచ్చినా
రను వర్తమానము మాప్రభువులు విని వారిని సబహుమానంబుగ నెదు
ర్కొని కార్యంపుతొందర లేకుండినచో నిప్పుడు జరుగుచున్న వేంగళ
రాయని వివాహమున కొకపరి తోడుకొని రమ్మని నాకానతిచ్చియు
న్నారు. ఇంక నేను వారిభేటీకిఁ బోయెదఁగాక:— కాని, సర్వకాలం
బులందును మత్తుపదార్థంబులఁ గుత్తుకబంటిగ మెసవి మైమఱచి యుం
డు నాహైదరుజంగునకు నాసందేశ మెఱింగింపవలయు నన్నఁ గొంకు
వొడముచున్నది. ఒడలు తెలియక యుండునాతురక నాకేమొని యవ
మానము సేయ యత్నింపఁడు కదా!— యత్నించుఁగాక! కరవాలసహా
యుఁడనై యున్న నన్నాతురక కాదా పురారి యడ్డినమాత్ర మేమి సేయఁ
గలఁడు? పొరపడితిని. మొన్ననే కదా! బుచ్చన్నగారు వచ్చి పరా
సులతో మనకు యుద్ధమనవసరమనియు వారుఁగూడ సామమే యనుసం

ధించుచున్నా రనియు బూసిదొర చెప్పినట్లు వచించె. అట్టియెడ వారు నన్నవమానింప నేల యత్నింతురు?— ఇంకను విజయరామరాజు వీర ులతో నేలవచ్చుచున్నాఁడో? అదికూడ నాలోచింపవలసినవిషయమే కదా! పయికి యుద్ధమునకు రామని వార్త నంపి లోలోన నేమేని కుట్రలు పన్నుచు యుద్ధప్రయత్నము చేయుచుందురా! వారి ప్రయత్న ములనన్నింటి నిప్పుడే లీలనేని కనుఁగొనవలయు. ఇంకే నాలస్య మొన రింపక వారలభేటీకిం బోయెదఁగాక:— (నిష్క్రమించుచున్నాఁడు.)

## రంగము - హైదరుడేరా

[హైదరు-విజయరాములు కూర్చుండి ప్రవేశించుచున్నారు.]

హైద.— హిజ్యారాజా! నీవ్ మాఖీ యిస్తావ్ ఖరార్ బోలో! బారా లాక్ రుఫియామే హింకా హెప్డా యిస్తావ్ మాఖీ బోలో!

విజ.— పదివేలరూపాయీలు మీ కీవఱకే యిచ్చియుంటిని కదా! కొదవ పైకమంతయు బొబ్బిలి మా కొసంగినప్పు డిచ్చెదను.

హైద.— రాజాజీ! మన్మ భొబ్లీమీద్కి ధండూ యెల్తాంసంగ్తి హింకా రంగ్డీకి తెలుస్తానై. హాంచేత మన్మ వోర్ని షుల్బంగా సఫాయ్ సెయ్యాచ్చు.

విజ.— మీ రాలోచించి చేసినది వ్యర్థమై చనునా?

హుస్సేను.— (ప్రవేశించి) సర్కార్ సాబ్! హెవ్రో భొబ్లీరంగ్రావ్ ధగ్గానించి యేక్ ఫైల్మాన్ వుంటాడ్ హుజూర్ భేట్కి ఆయా!

హైద.— హిజ్యారాజా! హెవ్రూవోయ్ హోడూ!

విజ.— లోనికి రానిండు! అతనితో సంభాషించినపిదప అంతయు మీకే తెల్లము కాఁగలదు.

హైద.— హోణ్డీ యిఖ్ డాకి రమ్మన్.

వెంకయ్య.— (ప్రవేశించి తనలో) అదిగో! దురాత్ముఁడగు నావిజయరా మునిఁ జూచినప్పటినుండియు నాశరీరమున శాంతరస మిముడక కోప

ము వెల్లుబ్బుచున్నది. ఏమిచేయుటకును ఇది సమయము కాదు. నా
నేను నిర్వర్తించికొనియెదఁగాక! (పైకి) హైదరుజంగుబహద్దూరువారి
సలాములు.

హైద.— హెవ్రూవోయ్ నివ్వు! బతేషిపాయీ రంగ్డూరాజ్ ధగ్గా భీ
ట్యా యేటి ? కైకూ నీవు హిఖ్డాకి వఛ్యావ్ ?

వెంక.— (తనలో) అవురా! ఈకఱకుతురక నన్నెంత బిట్టుగ నవమానిం
చినాఁడు ? ఏనిడినసలా మందుకొనకుండిన మానెఁగాక ! మాప్రతి
పక్షుఁడగు విజయరాముఁ డాసీనుఁడై యున్నతటి వారియెదుట నన్ను
నిలువఁబడఁజేయుచున్నాఁడు. "కార్యార్థినః కుతో గర్వః" యను
కార్యార్థినగు నే నిప్పట్ల ననుసరింపఁ దగినమార్గముననే ప్రవర్తించెద
గాక! (బహిరంగముగ) సాయేబుగారూ ! మీ రూహించినట్లు నే నా
రంగారాయనిం గారి సేనానాయకులలో నొక్కరుండనగు వేంకట
పేరిటివాఁడ ! మాప్రభువర్యుండు తమ భేటికిం బంపియుండుట
వచ్చితి. సెలవైన వచ్చినకార్యము నివేదించికొనియెద:—

హైద.—మీది యెల్మాజమీందార్కి మేల్ వస్తాద్ మియ్యా ! హో
ఖల్మాఖిల్మా హెక్యావుంటుంది తోస్తుంది. మాది భేట్కి హోరూ
యం హెండుక్ వస్తార్ ?

వేంక.—తమ రెప్పుడు రమ్మని కబురంపిన నాక్షణమ వారు వచ్చుటకు
సర్వవిధముల్ల యత్నించుచునే యుందురు.

గీ. పాలనము సేయు సర్కారువారు రమ్మ
టంచు దయ యుంచి వార్త లంపించునపుడు
రాకపోవునె ? ఎంతటిరాయఁడైన
మాఱుమాట వచింపఁగ వారితరమె ?

హైద—హీ రాభొబ్లిహోరూ మాటల్ మైయికీ పాలా తీస్తా సెప్తార్;
మాఖీఅచ్ఛా మాలుమ్; మాదీ ఘర్మాల్నామే హాంద్రూ రాజ్లూ భుర్రా

మీధా యేస్కాని మేరాఖేట్కి హోతాహైతూహూంటే మీదిరాజ్ భల్మా హెూక్వా హుంది హాంద్కి రాడ్ తోస్తుంది. తుర్కవాడి రాజ్జెం హాడ్కి మాలుమ్ నహీహై! మాదీ ఫిరంగిదెబ్బమచ్చు సూస్తే హాప్డా హాచ్చా మాలుమ్ హైతుంది. హింకా ఖోద్దిదిన్మ హుండ్మన్ వోయ్. మేం వారిదర్శణాన్కి వస్తామ్.

వేంక - (తనలో) ఔరా! ఏమిది? ఈతఁడు మాటలాడెడి ప్రతియంశ మ్మును గూడ మాకు విరుద్ధముగనే కన్పట్టుచున్నది. మరల నీవిజయ రాముఁ డేమేని ధూపము వైచి యుండఁడుకదా! దైవ నిర్ణీతము నెవ రేని దాఁటువారు కలరా! నేనుం దగినభంగి వీరలకుఁ బ్రత్యుత్తర మిచ్చెదఁగాక! (ప్రకాశముగ) యవనాధిపా!

మ. అపచారమ్ములుమీకుసుంతయును జేయం బోముమీరిట్లుకో
పపుఁజూడ్కుల్ ప్రసరింప నేమిటికి? మాపై రంగరాడ్భర్తతా
నెపుడు న్మీకెదు రాడ లేదు మిము నెంతే గౌరవస్ఫూర్తి ను
ల్లపుఁదమ్మిం దలపోయుతేనినిటుచుల్కంజూడఁగాఁబాడియే?

క. తలిదండ్రులు పిల్లలపై
నలుకన్ వహియింప నగునె? అటులైనను వా
రల కేది దారి? మీరే
సెలవీయన్ వలయు యవనశేఖర! యెలమిన్.

హైద — మీరు మాటల్ భలే షెమత్కారం సెప్తార్! మీదీ రాజా మామీద్కి లడాయికి తయ్యార్ వున్నాడ్ వింటామ్! క్యా బోల్తా?

వేంక. — రామరామ! మీ రెంతటిమాట సెలవిచ్చుచున్నారు? మాప్రభు వరేణ్యుండు కలలోనైన నట్టిది యాలోచించు నని మీ రెంచకుఁడు.

చ. హరిహరి! ఎంతమాట యవనాధిప! యేలినవారితోడ సం
గర మొనరింప నెవ్వఁడయినఁగాని మదీశ్వరుఁ డెంచువాఁడె? ఎ

వ్వారు వచియించినారో! పరిపంథికులం బది సత్యమంచు ధీ
వరులగు మీరు నమ్మఁదగవా! ఎదురాడఁగ మాకుశక్యమా?

మఱియు:—

ఉ. నమ్మఁగరాని వాక్యముల నమ్మి మముం గడుఁ జుల్క సేయధ
ర్మమ్మె? హరిస్వరూపులగు రాయనిగా రిసుమంతయేని నే
రమ్మును జేయలే దది కరమ్ము నిజమ్ము మదీశ్వరుండు న్యా
యమ్మును దప్పనట్టిసుగుణాఢ్యుఁడు హైదరుజంగుసాయెబా!

హైద.— మాఖీ హది హఖ్ఖా లేద్! మీదిరాజ్ మాదీ మొల్లాజ్ మత్కు కైకు ఆతా హై? ధాన్కి ఖార్ణం హేంటి హుంది బోలో?

వేంక.— సాహెబేంద్రా! మాశత్రుఁడగు విజయరామరాజు తమదర్శనమునకు వచ్చినాఁ డని విని మేముఁగూడ నపుడే వచ్చినచో మాయిరువురకేమేని జగడము వచ్చునేమో యని భీతిచే రాలేదు. మన్నింపవలయు.

క. తమభేటికి వచ్చును జిత
విమతారి మదీయభూమివిభుఁ డిఁకఁ గొల్చున్
తమరు దయచేసి వారికిఁ
గ్రమ మగుగౌరవము నీయఁగలిగిన యెడలన్.

విజ.— (జనాంతికముగ) చూచితిరా! ఆతఁడు "జితవిమతారి" యఁట! వారలకు మీరు క్రమమగు గౌరవ మీయఁగలరో లేరో యని సందేహించుచున్నారఁట! క్రమముగ మీ కేయంతయు వెల్లడి యగుచున్న దికదా!

వేంక.— (తనలో) అదిగో! ఆవిజయరాముఁ డేదియో వాని చెవిలో నూఁదుచున్నాఁడు. ఇఁక మాకార్యము వ్యతిరేకముగఁ దిరుగునేమో? దైవవ్యతిరేకమునకు మనుజుఁ డేమిచేయఁగలఁడు?

హైద.— (కోపముతో) వంకాంయ్! మాటామాటానూస్తే మెత్తామెత్తా సెప్పిపని గట్టిగట్టి సేస్తావ్! మాదీ తడాఖా యిఖ్ఖా కొద్దిదిన్ముల్లో

సూప్తామ్ సూసోక్కవోయ్ ! మీదీరాజా దాన్తో ఖోట్ ఖాలీసేసి పాల్కొండమస్నెమ్మె జావ్బోలో, మీకీ ఖ్యాల్ ఖావాల్ హేమ్ ?

వేంక.—సాయెబేంద్రా ! ఏటిమాట లివి? మమ్ములను గోట విడిచి వేళ్లో కచోటికిఁ బొమ్మని చెప్పుట మీ కేమేని యుచితముగ నున్నదా ?

ఉ. నేరములేనిమాపయిని నేరము మోపి వినంగరాని యీ తీరునఁ గోపఘూర్ణితమతిన్ మముఁ బ్రోల్వెడలింప నెంచి స ర్కారిటు పల్కుచున్ నిరపరాధుల సాధులఁ బంధువంటిసం సారముమాప నెంచుట విచారము కాదె? తురుష్కశేఖరా!

అదియునుంగాక.—

ఉ. రాయనిగారికిం దమకు రాఁజుచునుండెనె? ప్రాఁతవైరముల్ పాయక మీకు నేమయిన వారపచారము చేసినారె? ఇ ట్లాయితమై గడీ విడిచి యవ్వల కేఁగుఁడటంచుఁ బల్కనా నా!యవనేశ్వరా!ఉచితమాయిటుపల్కుటమీకునాయమా.

మఱియు,

మ. మునుమాచేతకు షేర్మహమ్మదు కడున్మోదించి మాకప్పడి చ్చినజాగీరిది నాఁటఁగోలె నిచటన్ స్త్రీబాలురన్ గూడి మే మునుమావారలునున్న వారమిది మమ్మున్నేఁడుపొమ్మన్న నే మననామిమ్ములనెందుఁబోవుదమునాయమ్మేయిటుల్వల్కఁగన్.

హైద—హెక్కాఖి పోతే హాఖ్డాఖి ఘాండీ - మాఖూ జరూరత్ నై! ముం దు మీదిఖోటామాత్రం ఖాలీ కావాలా!

వేంక—సరిదే మీ రనినట్లు జరిగినచో జరుగవచ్చును, గాని;—

క. ఏమపచారమ్ములు మీ కేమొనరిచినాము ? కోట నేటికి విడువన్ ?

రామలతో బాలురతో
నీమూర్ఖపుఁ బట్టు నీకు నేలా పోడమెన్ ?

హైద—(కోపముతో) హారే! మాఖీమూర్ఖం గీర్ఖం సెప్తావ్ బద్మాష్!
మాదీ సత్వా ఫిరంగిదెబ్బ నీఖీ మాలుమ్ నహీఁ ?

గేయము.

మాదీ ఘుస్సా సేస్తే మంచిమంచి పోళ్లు
మల్మాల్మాల్ మాడిపోతార్
మాదీదయ్యా సేస్తే మాలపోణ్ణికూడా
మంచ్ మంచ్ మంచ్ మారాజ్ సెస్తామ్.
మాదీభల్మా నీఖి మాలుమ్ నైతో స్తుంది
మాదెబ్బల్ నీఖి సూప్తామ్
మీాదిరాజ్కు బోలో మేమె భేట్కి హొచ్చి
మీాబొబ్బిల్ ఖాల్చివేస్తామ్.

వేంక—మీా రధికారులు. అదియునుం గాక శత్రుపక్షమునందుఁ జేరియున్నావారగుటచే మమ్మెంత నిందించిన మాకది గౌరవహీనము కాక పైపెచ్చది గౌరవజనకమే! మఱియొకమాట:—

ఉ. పేష్కసుఁగూర్చఁగా నిటకు వేడుక వచ్చి యరాతిపక్కబల్
దుష్కృతులెల్ల నున్విను చుదూరముగా మముఁబొండటంచునీ
ముష్కరమార్గమే తమరు పూనిన మిమ్మెవరడ్డువారు? ధా
నుష్కశిఖామణీ! ఎదఁగనుంగొను మెయ్యది న్యాయమార్గమో?

ఉచితానుచితపరిజ్ఞానంబు కలిగి యే మొనరించిన చెడ్డపనులకుఁ బ్రతిఫలముగ మమ్ముఁ గోట వెడలింప నెంత రేమో? అట్లయినచో,—

క. సరకారుపట్ల మే మె
వ్వర మేమిటి సలిపినాము? వదలక మమ్ముం
ద్వరఁ గోట వెడల నడచుట
మరియాదగ నున్న దే? అమానుషము కదా!

హైద.—వంకాయె! మాఖీ యెద్రూ బాత్ సెప్తావ్! నీఖి యెంతబోలో! మాఖి కూచ్‌బీ జరూరత్ నై. మొద్దా మీదీ గడీ యిడ్చి పొండి. తర్వాత మాఖీ దయ్యావస్తే మీఖీ యిస్తామ్! లేఖ్‌పోతే హీంజ్యారా జాఖీ యిస్తామ్! మేరా దిల్!

వేంక.—నాదొక్కమనవి కల దది సాంతముగ నాలకించి మఱియు గడీ విడిచి పొమ్మనుఁడు.

సీ. తమ కనిష్టంబైన దారి గొంటుతనాన
మానక మే మేమి మసలినామె?
సరకారువారి పేష్కసు నీయ మని చెప్పి
కొంచక మి మ్మటాయించినామె?
ఏలినవారితో నెపుడేని యేమేని
యడ్డదిడ్డపుమాట లాడినామె?
క్రూరత వహియించి దారుల దోపించి
బాటసారులఁ జిక్కు పఱిచినామె?

తే.గీ. దొంగతనములు చేయింపఁ దొడఁగినామె?
బాహుదర్పంబు చూపించి ప్రబలినామె?
ఏల చోరులయట్లు మే మిల్లు విడిచి
పోగునంతటిపని వచ్చె? సామెబయ్యా!

మఱియు మీరు మమ్ములను గడీ విడిచి పొమ్మని చెప్పి అది క్రమించుటయే మీముఖ్యోద్దేశ మైనచో:—

ఉ. పోరికి నేల సిద్ధమయి పోవుట రండటకేను రాయనిం
గారికి నచ్చఁగాఁ బలికి క్రచ్చఱ నిల్వొడలింతుఁ గోట స
ర్కారు గ్రహింపఁగాఁ దగు సుఖమ్ముగనస్మదరాతిరాయఁడీ
పౌరుషహీనుఁడచ్చటకు వచ్చిన సంధిచెడుఁ సమస్తమున్.

హైద.—వంక్యాయ్! మాఖీ సంటిపిల్లడ్కి సెప్పి బయ్యంసేస్తావ్ తోస్తుంది. ఆఖోటా మేమ్ తీస్కోని మేరాదిల్ యేలాసెస్తే ఆలాగ్ సేస్తామ్. కంచెన్కి దారా పోస్తామ్. నీఖీ యేంవోయ్? నీదిపనీ ఖోటా విడ్చి అవ్లాఖి పోవ్‌డమ్.

వేంక.—అదిగో! అదియే వలదని మాటిమాటికిని తమతో నివేగించుచున్నానే. మీకాకోట కావలని వచ్చినచో మీరుమాత్రము గ్రహింపుఁడు. మా కభ్యంతరము లేదు.

చ. కనలుచు మమ్ము నిల్వొడలఁగానడిపించుచు మాయరాతులఁ
గొని కడుఁ బెద్దసేయుచును గోటను వానికి నీఁదలంచుటల్
చన వవిమీకుమాకుఁ గొనసాగనికృత్యము లెన్నఁడేనిమీ
మనమున నూహసేయుఁ డవమానము సైఁపఁగ లేము సాయెబా!

మానధనులును కీర్తివిశాలురును సన్మార్గసంచారులును అగు రేచర్లగోత్రోద్భవులు తుదకుఁ దెగుటకైన నొప్పుకొనియెదరు కాని యవమానము సహింపనొల్లరు. ఇది యంతయు జగద్విదితమే! కావున; ఒక్కకోట విడిచి పొమ్మనుట తక్క మఱి యేమి చెప్పినను చేయుటకు సంసిద్ధులయి యుందురు.

హైద.—హింతా ధీనంగా హిప్డు నీవ్ బోల్తావ్ ! మొట్టమొద్టా మాఖీ పేష్కస్ కైకూ సెల్లించక్పోవాలా? ధాన్కి హేంటికార్ణం హుంది బోలో వోయ్!

వేంక.—సాయెబేంద్రా ! మీ రిట్లు మాయార్తి సమగ్రంబుగఁ దెలిసికొని మమ్ముద్ధరింతు మన్నప్పుడు మాకేల కొదవ యుండును? మాకుంగల పెం

ఢ్లితోఁ గొందరలచేఁ గప్పము చెల్లింప నింత యాలస్య మయినది. మాకన్న ముందీ రాజుమాత్ర మేమేని యిచ్చినాఁడా? అట్లనుటలో వీరిపయిఁ గొండెములు చెప్పవలయు నని నాయభిప్రాయము కాదు. దాని కేమి?

ఉ. కప్పముఁగట్ట లేదనుచుఁ గార్యముఁబూనఁగ నొప్పునయ్య! మే
మిప్పుడె మీ యనుజ్ఞ యగునేని రవంతయు నుండకుండ మా
కప్ప మొసంగమా? మిగుల గౌరవవృత్తిని మా ప్రభుండు "మా
తప్పు క్షమించుఁడీ" అనుచుఁ దానయి నిక్క బతిమాలకుండునా?

మీరు దయఁదలఁచి మమ్మనుగ్రహింతురేని యొక్క కప్పమే కాదు.

క. దానికిఁ బదిరెట్లుగ బహు
మానము మే మిచ్చుదుమయ్య మన్నింప నగున్
మానము గలవారికి నవ
మానము ఘటియిల్ల నెట్లు మన నగు నిలపై?

హైద.—వంకాయ్! మిమ్మల్ని రచ్చించ్వాలా హుందీ. వమ్యం మిగ్లిపోయింది. మీదీ రాజాఖి షుకంగా హుండ్వాలా హుందీ హాంటే మాం హోక్టి సెప్తామ్. మేరాబాత్ యినో్క, మీదీ రాజా హూచ్చి యిజ్య రాజాఖి సలామ్ సేసి మీరు హోరు రాజీనామా సేస్కాండి. హాది సెయ్కాపోతే ఖోట యిడ్చి జావ్. హిది రెండు సెయ్కాపోతే మాదీ లష్కర్ మాదీషిపాయ్ హుందిలేవ్, మీదీ ఖోట్లి హూచ్చి సాఫ్ సఫాయ్ సేస్తాడు హింఖా ఝూటాబాత్ మత్ కరో.

వేంక.—సాహేబా! నేను దబ్బరమాట లాడుచున్నా నని యూహించుచున్నావో?

ఉ. దబ్బరమాటలాడఁగ నధర్మపరుండగు రామరాజు గా
నబ్బెసమేని లేద యటులాడఁగ మాకు ధరాతలంబు త

బ్బిబ్బయిన్న నృపోత్తులను, బెబ్బులులంచునుగీర్తిఁగన్న మా
బొబ్బిలివారు పల్కరు నృపుంబలభీరులు కారు సాయెబా !

క. గౌరవహీనుఁడు విజయ
త్సౌరమణుని నాశ్రయింపఁ జను నని చెప్పన్
నో రెట్లు వచ్చె మాభూ
దారుం డొకభీరుఁ డంచుఁ దలపోసితివో ?

కటకటా, సపుత్త్రమిత్త్ర కళత్ర పరివారంబుగ మాప్రభువరేణ్యులఁ గోటవిడిచి పొమ్మన నీ కేమయిన నుచితముగఁ దోఁచినదా? అంతటి యుచితానుచితపరిజ్ఞానంబు కలిగియుండిన నీవేటి కిట్లుందువు ?

మ. ఇను నేనిన్ గడకంటఁజూడనిసతుల్ హ్రీడావతుల్ వెల్లమా
నినులవ్వారలసిగ్గుమాలియెట కేనింగొంచుఁబొండంచు, మీ
రన నౌనే?తమ కేమిచేసితిమి యెగ్గయ్యారె? హాకీము లె
ట్లనినం జెల్లెనుగాకయొండొకఁడెయిట్లన్న న్ధరంగూల్పనే ?

హైద.—వంకాయ్! నీఖి సస్తావ్ వాలా హుంది యేంటిహోయ్. హట్టా గెట్టిగెట్టి బద్మాష్ బాత్ బోల్తావ్.

వేంక.—హైదరుజంగుసాయేబుగారూ !

ఉ. చావఁ దెగించువారలకు సంద్రముపాదముబంటియంటమున్
వేవురు చెప్పఁగా వినవె?విశ్వము బిట్టు వడంకుఁగాక మా
రావుకులాగ్రగణ్యుఁడగు రంగమహీపతి గెల్చుదోర్బలుల్
చావన భీతిఁ జెందరు ప్రశస్తము లీవచనంబు లుర్వరన్.

ఆమాటలఁ దుది విమర్శించికొనవచ్చును కాని; నావాక్యముల నన్నిఁటిని సావధానుఁడవై వినుము.

శా. మా కత్యంతవిరోధి రా జితనిదుర్మంత్రంబు లాలించి దే
వా కార్పణ్యముఁబూని కోటవెడలింపంజూచు టన్యాయమీ.

లోకులాకులురవ్వసేతురుదయాలోలుండవై మామొఱల్
నీకర్ణమ్ములఁ జేర్పుమా! యశము ప్రోనీకుండఁ గాపాడుమా!

క. మారాయఁడు సుగుణాఢ్యుఁడు
తా రిచ్చెడియాజ్ఞలు జవదాఁటఁడు కానన్
గౌరవముగఁ గన నొప్పును
ఘోరుడుపం దగును సంధి ప్రోసఁగింప నగున్.

హైద.—హిజ్యరాజాఖి సలామ్ సేసి సంధి సేస్కామ్మన్ లేఖ్ పోతే ఖోట యిడ్చి హాహ్లాఖీ పామ్మన్. హూక్టేబాత్.

వేంక.—ఈరెండునుం గూడఁ గలలోనైన జరుగనిపనులే!

ఉ. ఎంతటిదాఁక జీవనము లీమెయి నిల్చునో అంతదాఁక శ్రీ
కాంతుఁడు వచ్చి పోరినను గా దననేల? గడీని వీడ మే
మంతకు మున్న యీయధముఁడౌ విజయేశునిసంధి సేయఁగా
మంతన మాడఁబోము పలుమాటలిఁ కేటికి? ఖానుసాహెబా!

ఈవాసందేశమ్ముతోపాటు నీ కించుక యుపదేశము గూడఁ జేయఁదలఁచినాఁడ. అదియుఁ గూడ సావధానుఁడవై విందువుగాక:—

ఉ. రంగనృపుం డొకండె సమర మ్మొనరింపుచు మిమ్ము నెల్ల రణ
భంగము సేయుపట్ల బలవంతుల మంచును బొంగుచున్న మీ
జంగులు ఖానులున్ దొరలు చావక నిల్వరు వాస్తవమ్ము దు
స్సంగుఁడు రాజుమాట విని చావక జీవము నిల్ప నెంచుమా!

శా. బారఁ లెక్ గొని వేంగళుండు రిపుభిత్ ప్రావీణ్యముల్ జూపదు
ర్వారాటోపబలమ్ముమై నెదుర నీరాయం డరాయండునై
పోరున్ జూచునకాని కయ్యమున నిల్వన్ జాలఁ డీవిట్లు ప్రో
రారంభింపక సంధికిష్టపడుమా! అన్యాయముల్ మానుమా!

శా. సాహుఁ బ్రద్రుఁడనంగఁ గుంతమును నైకెసంధించిసోత్సాహుఁడై
యక్షీణప్రతిపక్షులన్నెడపునై న్యాధ్యక్షుఁ డుత్క్షోభిత
ప్రక్షీణాఖిలదోర్బలుం డయినపాపారాయఁ డొక్కండె ర
క్తాక్షుండై మిముఁ గాంచెదత్ క్షణమె సైన్యమ్ముల్ క్షయిం
చుంజుమీ!

మ. వరసారాయఁడుధర్మరాయఁడునుచిన్నారాయఁడుఁ ఘోరసం
గరభూమిన్ దమయుద్ధలీల నెఱప మీఖానులక్కళాహీనులై
ధరణిన్ ద్రెళ్ళెదరింతనిక్కువము మద్వాక్యమ్ములాలింపుమా
కరుణన్బెంపుమ! న్యాయబుద్ధిఁగనుమా! కయ్యమ్ముచాలింపుమా.

హైద.—సరే! హద్ది హద్ది సత్వా లడాయ్‌మే నూస్తాం హోయ్! నీకి సెప్పవాకర్ లేవూ! మీఖీకాని మాఖీ హీర్లు హుందిలేవ్! మాదీ యీాడ్డు మాం సెప్తామ్.

గేయము.

లాడూమే హున్నాడ్, లట్‌పట్‌కి సెప్తాడ్
లాసూ హోడ్తున్నాడ్ లచ్చెమ్మె సెడ్డు,
పిల్పిల్ హోడ్తున్నాడ్ బిల్లాల్ హోడ్తున్నాడ్
హాస్నల్లీ షుక్రుల్లా ముజ్‌పర్‌మే హున్నాడ్,
కుప్పీమ్మే హున్నాడ్ కుప్లామ్మెహున్నాడ్
జానూజాడూమార్టిన్ జంద్రాల్మె హున్నాడ్,
హైదర్‌మే హున్నాడ్ హిజ్యరాజున్నాడ్
హేమ్‌మియ్యా మీధగ్రా హెక్యాహున్నారోయ్?

వేంక.— మీయొద్ద సైనికులు లేరని నేను చెప్పుచుండుటలేదు. మీకు భీతిఁ బుట్టించుటకయి మావారల నుడివియుండను లేదు. సాయేబు

గారూ! తాఁబట్టినకుందేటికి మూఁడే కాళ్లనుగతి మీ పట్టు వదలకు న్నారు. మీకెత్తిపత్తు రనుభీతి సుంతయు మాకు లేదు. ఏల యంటిరా!

ఉ. న్యాయపథమ్ము వీడి కదన మ్మొనరింపఁగ నెన్నఁడేని మే మాయిత మౌచు రాము రిపులంద తెహే యని కేలిసల్పఁగా జాయలఁ గొంచుఁ గోట విడిసాగము వేయివచింపనేల ? మీ చేయఁగలంత చేసికొనఁ జెల్లును లక్ష్యములేదు మాకికన్.

హైద.—హాకే! నీవు నోటికి హోచ్చాబాత్ హంతా పేల్తావ్ బద్మాష్ రాయశారీగాడికి హింతపొగ్రుబోత్ హుంది. నీఖి యేం సేయిస్తామ్, సం పెయ్యిస్తామ్:—.

వేంక.—ఓరీ! మూర్ఖాగ్రేసరచక్రవర్తీ! నన్నుం జంపివేయింతువురా! అదియును జూచెదఁగాక! రమ్ము.

లయగ్రాహి.

జారా! గుణదూర! వడి రార యిటు పోరుటకు,
బీర మది యున్న నిటు లేర వచియింపక్ ?
కారు లవి చాలును మహారణమునందు విను,
మోరి! పొనరించెద విదారితశరీరుక్,
పౌరుషవిహీనునిగ నారుచిరఖడ్గవిక
టోరునటనక్ దురకభీరుఁడవు! నీవే,
రా! రణమునందు ననుఁ దారసిలఁగాఁ దగిన,
పీరుఁడ వహూ! మసల కోరి! బల మున్నన్.

హైద.—అరే! దర్వాజా మే కోన్ హైహరే! హీవాంకాయఖి నికాల్ దేవు సెప్పు-గొంటెయ్.—

వేంక.—(కోపముతో) ఓరోరి తురుష్కాధమా! నన్ను గెంటుపాటి సామర్థ్యము మీలో నెవ్వరికున్నదో రమ్మనుము చూతము! ఔరా! విచిత్రము!

శా. గెంటింపింతునటంచుఁ బల్కితివి నన్గెంటంగ బల్దంట యుం
దుంటర్ వింట యెఱుంగ రమ్మనుమురా! యున్నేని వైశమ్మన
న్నంటన్దుంటరిగొంటుకాఁడ! యిదిగోనంటింతు నాదొడ్డవా
ల్నంటన్నిమ్ములమంటఁగల్ప నెదురై మారొక్కుమ్మురానన్నిటన్.

హైద.— (భయముతో) కోన్ రే లాడూ! లానూ! సిద్దీబిలాల్! మూసే సవాల్! హీడూ కౌఫర్ రాయ్‌బారీకే సాలా గడ్బడ్ కర్తున్నాడ్ సాథే మారేఖ్ను నూస్తావ్, జల్దీ ఆవ్! జల్దీ ఆవ్! ధవుడో! ధవుడో! హింక మీఖి హోల్సం కర్తే మాఖి మర్గయా హైతామ్.

(పాఱిపోవును)

వేంక.— ఓరీ! మూర్ఖా! పాఱుఁబోఁతా! ఏమేమియో ప్రతాపంబులఁ గొట్టఁబూనితి విదియేనురా నీ పౌరుషము? (రాజుదిక్కుకు) ఓరీ! పూష పాట్యన్వయాంభోధిబడబానలా! విజయరామహతకా!

క. పుట్టితివి రాచకొలమునఁ
బట్టితివి కటారి చేత బలువీరుఁడవై
గుట్టు విడి తురకకాళులు
పట్టితివా? నీతిమాలి పాఱుంబోతా!

అట్లు మా పాదముల నే పట్టితివేని నీకు బొబ్బిలి దానము చేసి యుందుమే.

చ. పరమగుణుండు రంగనరపాలునిపైఁ బగఁ బూని పూని సం
గర మొనరింపఁగా బలము కల్గమిఁ జింతిలి యెట్ట కేలకున్
దురకలపాదముల్గొలిచి తోంటిపగన్ దరియింప నెంచితే
దురమున నాతనిన్ గెలువఁ దోయజనేత్రునికైన శక్యమే?

తెరలో-ఝూటా-రాయ్‌బాదీకి మారో మారోపకడోపకడో.

వేంక.—(వినుట నటించి తనలో) అదిగో! యవనబలంబులు నన్నుం బట్టుటకయి కోలాహలంబు దీపింప నీవంకకు వచ్చుచున్నవి. వీరలచేఁ జిక్కుపడకుండ నిందుండి తప్పించుకొని పోయి యీయుదంతము రాయనింగారికి నివేదించెదను.

(ప్రవేశము. సిద్దీబిలాల్ లాడూఖాన్ హైదర్‌జంగ్.)

లాడూ.—బిలాల్! హీది అద్మీమే ఖర్తీ మాజోర్గా తిప్తా హున్నాడ్: హింఖా హాల్సం సెయ్యాకీ హింన్ని యెన్నాకినిండి పట్కోవోయ్.

సిద్దీ.—హీడూ అచ్చావస్తాద్ హుండి తోస్తుంది భాయ్ మాఖీ! మన్కు హజాగ్రత్ వుంటే పరారీ సెప్తావ్. అజాన్‌లాగ లట్కాలట్కాగెంతుతాడ్. హాప్రీమీధా పడ్తే హాప్రీఖి సంప్తాడ్ సందేఘుంహుంది దేఖ్ దేఖ్! హెంత హచ్చాసాక్టెం సెప్తుంది.

(వెంకయ్య చతురగతిఁ దప్పించికొని నిష్క్రమించును.)

లాడు.—అరే! అరే! అల్లా! అల్లా! హీడూ బద్మాష్‌పని సేస్నాడ్! ఛనంలో సెల్లీఫిట్టాలాగా యెగ్రీపోనాడ్, యేంసేస్తామ్?

హైద.—హాణ్ని హెందుక్కీ హొద్దిఫెట్ సార్ హోయ్, హాడూ భలే వస్తాద్ హుంది. హీడు సస్తే భొల్లీఖి హెంతనష్టం హైతుంది. మాఖీ సంప్తాన్కి ఖర్తీ యెత్నాడ్! మాఖీ పరారీ సెప్కాపోతే హాప్తేసచ్చి హుందుమ్మ.

సిద్దీ.—సర్కార్! ఖేస్రీఫిల్లాలాగ హాడూ హక్డా సూప్తాడ్ హిక్డా హుంటాడ్ హాదిమద్దె పరారీ సెప్తాడ్ మై క్యాకరుమ్?

లాడు.—భొల్లిఖోటామే ముట్‌డి సెప్పి హాడ్కి సాఫ్‌సఫాయ్ సేస్తామ్ సర్కార్! ధొర్గారీ ఫర్మానామే రీర్ఘూహైహుంది. హింకా హిప్తే భొల్లీఖి షోయ్ మాచేత డాఖానూప్తామ్ సాబ్; దేఖో.

(అందఱు నిష్క్రమింతురు.)

నర.—రంగారావుగారూ! "గతం నశోచామి కృతం స్మరామి" యనువారు లేరనుటకన్న వారి నిందు రప్పించునుపాయ మూహింపుడు, రామయగారిని వారియెడ కంపరాదా!

రంగా.—అగును. బుచ్చన్నగారూ! మనరామయ్యగారి నీకార్యము నై వేర్చి రమ్మనుఁడు. మనచుట్టునున్నవా రెవరికిం దెలియరాకుండ రాత్రులనరుఁ బోయి బావగారినిఁ జూచి యుచితవిశేషంబులఁ జెప్పి సత్వరమ వారిందు వచ్చునట్లు చేయవలయును.

బుచ్చ.—ఈకార్యము రామయ్యగారికి నివేదించి వచ్చెదను.

(పోయి తిరుగ ప్రవేశించును.)

రంగా.—మామా! ఇంకేమి సేయవలయు ?

(తెరలో-దేవా ! ఎవరో హాసనల్లీ ఖానుడఁట! హైదరుపంపున వచ్చి దేవరదర్శన మభిలషించుచున్నాఁడు.)

రంగా.—తమ్ముఁడా! నీ వాసాయేబున కెదురేఁగి సబహుమానముగఁ దోడ్కొని రమ్ము.

(వేంగళరాయఁడు పోయి హాసనల్లీఖానునితోఁ బ్రవేశించును.)

హాస.—సలాము! రంగరావుబహద్దరువారికి.

రంగా.—సలామ్ ! హాసనల్లీసాయేబుగారికి. మీ రాయాసన మలంకరింతురుగాక.

హాస.—(కూరుచుండి) రాయనింగారూ! మీయతిథిసత్కారంబులఁ గడు నలరితిని. నన్ను బూసీదొరగారును, హైదరుజంగుసాయేబుగారును మీయొద్దకు దూతగఁ బంపియున్నారు. వారు తమతోఁ జెప్పుమన్న సందేశము చెప్పెదను. సావధానులరై వినుదురుగాక !

రంగా.—సర్వవిధముల సావధానుఁడ నయియే యున్నాఁడను.

హాస.—మిమ్ములను మాభేటీకి రమ్మని తాఖీదు లంపఁగా, మీరు రాక నిరాకరించినారు. మఱి మేము రెండవసారి యంపినహుకుంనామాలను చిదు

గఁ గొట్టినారు. ఇవి యన్నియుఁ జూడ మీరు మాతో యుద్ధ మభిలషించుచున్నట్లే తోఁచుచున్నది.

రంగా.—ఆహా! ఏమీ విరుద్ధాంశములు: ఇది యంతయు విజయరాముని పన్నుగడయే యైయుండునా?

హుస.—పోనీ! మీ రటుచేయలే దనియే యూహింతు మన్నను మా రాకఁ గాంచి మీరూరక రణభేరి మ్రోయించుచున్నారు. మఱి నౌబతు మా నుపరితిరి. కాఁబట్టి యీక్షణమ మీరు నౌబతు చాలించి కోట ఖాళీ చేసి మాకొసఁగవలయు. లేదా యుద్ధంబును సర్వబంధునాశంబు వెను వెంట నగు. పయి మీయిచ్చవచ్చినరీతిఁ జేయుఁడు. నా కేమిప్రత్యుత్తర మిత్తురో అది వారికి నివేదించెదను.

రంగా.—సాయెబేంద్రా! మీరు చెప్పవలసినమాట లైనవి కదా! వానికి మే మిచ్చెడి సమాధానముకూడ వినుఁడు. మావైరియగు విజయరామరాజు తొలుత మీయొద్దకు వచ్చియుండుటఁజేసి మీ మొదటితాఖీదునకు రానిం చుక శంకించితిమి. మఱియు పరాసులు వచ్చి రాజమహేంద్రవరంబున నున్నారనియు, వారలతో యుద్ధ మొనరింపఁ దనకు బాసటగ రమ్మ నియు విజయరామరాజు నాకు వర్తమాన మంపె. మేము దాని కంగీక రింపలేదు. బూసిదొరగారు రెండవసారి యంపినహరకాలాలను మేము మోదకపోవు టట్లుండ సబహుమానంబుగఁ బంపి యుంటిమి. వా రెందులకు తద్వ్యతిరేకముగ నుడివిరో ఇదియు, విజయరామునిప్రో త్సాహ మేమో తెలియదు. ఇఁక మేము రణభేరి మ్రోయించుచుంటి మంటిరి కదా! రెండుదినములక్రిందట మావేంగళరాయనితోపాటు కోటలో నేఁబది వివాహములు జరిగినవి. గతరాత్రియే యూరేఁ గింపు. ఆయూరేఁగింపు టుత్సవంబున వాయించెడి శుభవాద్య మది కాని, రణభేరి యెంతమాత్రమును కాదు. మీ కది నమ్మిక లేదేని మాతమ్మునిఁ గాని, యీప్రోలివంకఁగాని చూచినచో వాస్తవము తేటపడును.

హాస.—(స్వగతము) ఔరా! ఈవిజయరాముఁ డెంతమోసము చేసినాఁడు! పాపము! వీరలు వైవాహికోత్సవంబున నుండ నిదియంతయు రణసన్నాహ మని భ్రమింపఁజేసినాఁడు. (ప్రకాశముగా) తరువాత:—

రంగా.—మఱియు మేము చెప్పెడిదంతయు న్యాయబుద్ధి వితర్కించి మాకు న్యాయము దయచేయింపఁగోరెదము.

గీ. పాదుషావా రొసంగ నౌబత్తు దీనిఁ
గొన్నవారము కాని మే మెన్న దొంగ
వృత్తి నార్జింపలేదు మే మేల దీని
మానవలయును? చెప్పఁ డహీనచరిత!

అదియునుం గాక:—

శా. ఏ మీకోట బలమ్ముచే గెలువలేదే వారినిఁ ద్రోలి హా
కేముల్ మా కిడఁ బుచ్చుకొంటి మిచటన్ గ్రీష్మివాటిల్లినన్
మే మెన్నం డిది వీడలే దిపుడ యేమీ? కోట వీడంగ నే
లా! మాకంతటి కేమివచ్చినది? పల్కన్ జెల్లు మిత్రోత్తమా!

హాస.—(అంతర్గతము.) ఈనృపాలునివచోవైఖరియు ముఖవికాసంబును బట్టిచూడ నితఁడు కడు మంచివానివలెఁ గన్పట్టుచున్నాఁడు. మఱియు వితర్కించినచో నావిజయరాముఁడే దొంగవలె నున్నాఁడు. వీరియపుర కుఁగల యంతఃకలహములచే రాజు మమ్మిందులకుఁ బ్రేరేపించియుండును.

ధర్మా.—అయ్యా! సాయెబుగారూ! మీమాటలచొప్పుంబట్టి చూడ మీరు తురుష్కవంశీయులే రైనను విద్యాధికులుగఁ గన్పట్టుచున్నారు. ఎందేని లోకమం దిట్టివిపరీత ముండునా?

గీ. ఎన్ని తరములనుండియో యుండె మేము
కాఁపుర మ్మున్నవారము కాని కోట
విడిచి పొమ్మంట యీనాఁటిగడియవఱకు
విని యెఱుంగము వింటిమి వీనికరుణ.

ఉ. చాలు నీఁ కేమి చెప్పెద? విచారణసేయక మారిపుంగుఁడు, తా
నేలినవారితోడ నెదియే వచియించిన, దాని నంతయుం
బోలఁగ సత్యమే యనుచు బుద్ధిఁ దలంతురె? మిమ్ముఁబోలు స
చ్ఛీలురు. మీరె యిట్లయినఁ జెప్పెడి దేమి? ప్రపంచకస్థితుల్.

హాస.—(తనలో) ఆహా! ఈతఁ డెవఁడో నీతికోవిదునివలె నున్నాఁడు. వీని మాటలు వినుచున్నకొలఁది నమృతపుసోన లొలుకుచున్నవి. (పైకి) అయ్యలారా! ఆహైదరుజంగు పరమమూర్ఖుఁడు. వాఁ డెవరేమిచెప్పినను వినఁడు.

వెంక.—పోనిండు. వారికి మాకోటఁ గైకొనుటయే ముఖ్యోద్దేశ మయి నచో నట్లు సేయవచ్చును కాని,—

చ. పురహరుఁ డౌనుగాక: మముఁబోరన గెల్చినదాఁక కోట చే
కుఱ దది వాస్తవమ్ము మముఁ గొట్టుచు నస్మదరాతి వానికీ
పురము నొసంగఁగాఁ బ్రతినఁ బూనినవాఁడని వింటె మున్నుహై
దరు. తన కేమిధర్మ మది: తప్పన రాదధికారితప్పులన్.

వారి కంత యుద్ధమే చూడవలయునిచ్చ కలయదిరేని:—

గీ. విజయనృపునకు నలువదివేలబలము
కలదు. మాకు నాలుగువేలబలము కలద.
యిరువురబలమ్ము లెదిరి సంగర మొనర్చు
బవరమును చూడుఁడీ మధ్యవర్తు లగుచు.

వేంగ.—సాయెబేంద్రా! మావెంకయగారు చెప్పినచొప్పెంతయు రమణీయముగ నున్నది. పాప మావిజయరామునకు బొబ్బిలిఁ గొనవలయు నని యాశాపిశాచము మెండుగ బాధింపుచున్నది. వారిరాచపౌరుషంబును మాపద్మనాయకకులమువారిబీరంబునుఁగూడ బారునకుఁదీర్చి తాము మధ్యవర్తులరయి చిత్తగింపుఁడు.

ఉ. ఎవ్వఁడు తా రణమ్మున జయించునొ? వానినిఁ జేరఁదీసి, మీ
రివ్వసుధాతల మ్మొసఁగుఁడీ: యటుకాక గడీని వీడి మ
మ్మివ్విధిఁ బొమ్మనంగ నగునే?యటు లాడుట మీకు న్యాయమే?
నవ్వరె యెల్లరున్: యశము నాశనమై చనదే? తొలంగినన్.

హుస.—కుట్టివాం డ్రగుటచే మీరిట్లు పలుకుచున్నారు: రాయనింగారూ! మీయభిప్రాయ మేదియో స్పష్టముగ విశదీకరింపుఁడు: నే వచ్చి చాలత డవాయె: పోవలయు.

రంగా.—అయ్యో! మీరు మాపైఁ బ్రసరింపఁజేసిన యకారణజనితకటాక్షమునకు మే మెంతయేనిఁ గృతజ్ఞులము. ఆహైదరుజంగునకు విజయరామునకు డెంతయో లంచమిచ్చి యుండుటచేఁగదా! మాగడీ తీసికొని వారి కొసంగ నూహించుచున్నాఁడు! కావున,

చ. అతఁ డీడుదానికన్నఁ బదియంతలసొమ్ము నబాబుగారికిన్
గొతుకకయిత్తు: నావిజయుకోటను నాకు నొసంగుఁడయ్య: స
మ్మతి యగునేని, తెల్పుఁ డనుమానము లేటికి? యాధనమ్ము ని
న్నైతమకుఁ జేర్చువాఁడఁ:గృపఁ బెంచుఁడు:వాదుడుపంగనెంచుఁడీ.

హుస.—రాయనింగారూ! మీరు మమ్ములఁ బెద్దఁ జేసి మీకష్టసుఖంబులు మాకు నివేదించి యుండుటంబట్టి నాకుఁ దోఁచిన తెఱంగు చెప్పెదను. మాహైదరుజంగనినవాఁ బరమమూర్ఖుఁడు. వానికిఁ దోఁచదు. ఒకరు చెప్పిన వినఁడు. మీ రొక్కరోజుమాత్రము కోట విడిచి పైకి పోయి యుంటిరా! ఎల్ల కార్యములఁగూడ నే సమకూర్పఁగలవాఁడను. మీనీతి వర్తనమునుఁ గూర్చి బూసిదొరగారికి చెప్పి తిరుగ మీకోట మీకిప్పించెదను. ఇఁక యుద్ధమునుగూర్చి విచారింత మన్ననో, దాదాపు రెండు లక్షలబలంబుతో నున్న వారలతో మీరు పోరఁజాల రనుట నిశ్చయము. వారిఫిరంగులయెదుట మీబాణంబులు కత్తులు నేమిపనిచేయఁగలవు? ఊరికిఁ బోయి యుంటిమని రొంచి యొకనాఁడుమాత్రము కోటవిడిచి యుండినఁజాలును.

రంగా.—సాహేబుగారూ! మీరు వచించెడి దంతయు మా సేమముకోరియే యని తెలిసికొన్నాము. కాని,—

క. ప్రాణము లశాశ్వతమ్ములు
మానము శాశ్వతము: దాని మాని యిటుల్, సీ!
ప్రాణముల కాసఁజేయుచు
నే నిది విడిచికొని చనుట మృష యగు సుండీ!

హాస.—అయ్యా! మానుడులెల్ల ధర్మవర్తనములే యైనను ప్రస్తుతము సమయానుకూలముగ వర్తింపవలయునుగదా! అన్నియుఁ దెలిసియున్నతమతో నే నేమిచెప్పఁగలను: కాని,—(అర్ధోక్తిలో)

రంగా.—సత్యమే! కాని,—

మ. ఎటకేనిన్ జనుమంట: నౌబతును వాయింపింపవద్దంట: బల్
కటువాక్యమ్ములు తక్కనొండుపని పేఁకన్ సేయఁగావచ్చు:నే
నిటు వాకొంటి నటంచు వేఱుగతి నూహింపంగరా దీర తె
ప్పటికైనన్ మృతి యున్న దేకద కనన్ సాశ్చాత్యవంశోదయా!

క. పురి బిరుదు విడుచుకన్నను
మరణము కడు మేలు కాదె? మానవులకు నె
వ్వరికైనఁ దప్పునా మృతి
యరయఁగ నీనాఁడో: తేపో: యగు గుణధుర్యా!

సాహేబుగారూ! సలామ్: మీకుఁ గడు శ్రమ నిచ్చినారము. మావిధి యిట్లెద్చుచుండ, మాకుఁ గయ్యము కాక, నెయ్యము సంప్రాప్త మగునా? ఇంతదనుక మాతోఁ గలసి సంభాషించినందున మీరు మాకుఁ బరమాప్తులు. మరల మీదర్శన మీజన్మంబునఁ జేసికొనుభాగ్య మున్నదో లేదో! ఎవండెఱుంగు? ఉంటినా ఈసింహాసన మలంకరింతు. లేదా! వీర స్వర్గ మనుభవింతు. వెంకయ్యగారూ! సాహేబుగారిని తాంబూలాది సత్కారంబుల సంభావింపుఁడు.

హుస.—అయ్యో! వెట్టిరాజా! నామాట యిసుమంతయేనియు వినినాఁడవు కావేమి? వలదు సుమా! ఈవెట్టియే నీముప్పునకు హేతు వగునేమో యని భీతిల్లుచున్నాఁడ.

రంగా.—విశేషము వలదు. దుఃఖమునకుఁ గారణము.

హుస.—అల్లా! అల్లా! సలామ్; (వెంకయ్యతో నిష్క్రమణము. పునఃప్రవేశము వెంకయ్య.)

రంగా.—అయ్యలారా! ఎన్నివిధంబులఁ గయ్య మాఁగఁజూచినను ఆఁగు జాడ నుంతయేని కన్పట్టకున్నది. నాబతు మాన్పించి కోట విడిచిపోయి నచో సంధి కుదురు ననియు లేనిచో రంధి సిద్ధ మనియు నిష్కర్షగా తేలినది.

చ. కనికరమన్న నుంతయును గానఁగరాని దయావిహీనులం
దును గడుమోఁటకుండఁట! కనుంగొన హైదరువాఁడు వెల్మమా
నినుల నెటుల్ కనుంగొనునొ? నీచత వారలమానభంగమున్
బొనరువనెరీచునో? యకట! ముప్పొడఁగూడెనిఁ కేమి సేయుదున్?

మనవేంగళరాయఁడు కాంతాజనంబులఁ గొని యేగహ్వరప్రదేశంబులకో చని వారల భద్రముగఁ గాపాడుచుండినచో బాగుగ నుండునని నాతాత్పర్యము.

వేంగ.—అన్నయ్యగారూ! మీరు నన్నిట్టి నీచకృత్యమునకు నియోగించినచో నేనేమి మనవిసేయఁగలవాఁడను? విక్రమరహితులగు పిఱికిపంద లాచరింపవలసిన తుచ్ఛకృత్యము నాచేఁ జేయింపఁబంపుచు ఆఁడువాండ్రతోఁ గూడి నన్నుంగూడ వలస వీడిపొమ్మనుట మీకు న్యాయమా?

రంగా.—కాదోయి తమ్ముఁడా! ఇప్పుడు జరుగఁబోవు సంగ్రామమందు జయం బెదిరికే కలుగునేమో యని శంకించుచున్నాఁడ! అట్టియెడ దురాత్ముఁడగు రామరాజు మనయవరోధజనంబునకు మానభంగ మొనరింపఁ బ్రయత్నింపఁడా? మఱియు నీవుఁగూడ మాతోపాటైన నిఁక విజయరామునిపైఁ బగ సాధించువా రెవరు?

వేంగ.—మీ రట్లానతిచ్చిన నే నేమిసేయఁగలను? కానిండు. మీయాజ్ఞ రాణివాసంబునకుఁ దెల్పి, వారలఁ బ్రయాణసన్నద్ధలఁ జేసివచ్చెద. వారి సంరక్షణార్థమయి పాపయగారిని నియోగించి యేఁగూడ యుద్ధతలంబునకు వచ్చెదను. (నిష్క్రమించును.)

రంగా:—అన్నలారా! పరాసువారు మనకు సందేశ మంపియున్నారుకదా! ఇప్పుడు మనము వారికి తిరుగ సందేశ మంపక యుద్ధ మొనరించుట ధర్మవిరుద్ధ మగును. అదియుఁగాక యీహసనల్లీఖానుఁడు మనలఁగూర్చి బూసిదొరగారితో మంచిగ నివేదించు నని తోఁచుచున్నది. అది వినిన పిదప వారలమానస మేమేని తిరుగకుండునా?

నర.—మీ రూహించినట్లుగ నొకరాయబారిని వారియండ కంపినచో మిగుల బాగుగ నుండు నని నాయభిప్రాయము.

వేంక.—కాలము గడపిన ధర్మారాయనింగారైనచోఁ జతురగతులఁ గార్యము సాధింపఁగల రని నానమ్మకము.

రంగా.—మామా! ఈసంధానకృత్యము మాహిత మభిలషించి యంగీకరింప వేఁడెదను,—

గీ. రావువంశంబు కీర్తికి తావటంచుఁ
బేరు తెచ్చితి రీర మావారి కెల్ల
నిపుడు తద్వంశమున్ నిల్ప నెంచుఁడయ్య
తమరు దూతగ నటు పోయి ధర్మరాయ!

ఎల్లయంశంబులుఁగూడఁ దమకుఁ గరతలామలకంబుల. తమచతురత నను సంధించి సంధియే పొసగింతురో, రంధియే సమకూర్తురో? తమచిత్తము.

ధర్మా.—వత్సా! దీనికయి నాతో నీ వింతగ చెప్పవలయునా? ఏ నటకుఁ బోయి సత్వరంబ వచ్చెదను. నాకు ముదలనొసంగుము. (నిష్క్రమించుచున్నాఁడు.)

వేంగళరావు.-(ప్రవేశించి) అన్నయ్యగారూ! నేను వెళ్లి తమయాజ్ఞ స్త్రీజనంబులతోఁ జెప్పఁగా, వారు తమతో నేమియో మనవి సేయవలసియున్నదని చెప్పి, వదినెగా రిచ్చటికే వచ్చుచున్నారు.

రంగా.—ఏమీ! రాణివాస మిచ్చటికే వచ్చుచున్నదా? ఎంతదుర్ణయము! వాంఛ్ర కేమేని పిచ్చియెత్తియుండనోపు! (సభ్యుల నుద్దేశించి) సదస్యులారా! మీ రింక నిండ్లకుఁ బోయి సమరసన్నాహంబులలో నుండుఁడు. ధర్మారాయనింగారిరాయబారమూసార మెఱింగి మీ కిపుడె కబు రంపెదను.

[వెంకయ్య, బుచ్చన్న—నరసారాయఁడు నిష్క్రమింతురు.

చినరంగారాయు నెత్తికొని పటాక్షేపంబుగ మల్లమాంబ ప్రవేశించుచున్నది.]

రంగా.—దేవీ! నీకేమేని మతిపోయినదా యేమి? ఘోషాగల యవరోధజంబు లిటు పలువురుగల సభారంగమునకు రాఁజెల్లునే? ఇంక నేని యీపను లుడిగి నీపని నివేదించి యింటికిఁ బొమ్ము.

మల్ల.—నాథా! క్షమింపవలయు; నా కిపుడు మీమాటలు వినుచున్న కొలఁదిని మతియే పోవుచున్నది. ఆకటా! పవిత్రపద్మనాయకవంశంబునఁ బ్రభవించి, క్షాత్రమే ధర్మముగా నింతవఱకు నిల్పికొనిన మీకీనాఁటి కాబుద్ధి పోయి పాడురాచబుద్ధి యలవడినదేమి? మీకేగాని మాకుమాత్రము వల సవిడిచిపోవుట యవమానకరము కాదా? గడియకో గడియకో కోటలో శత్రువులు ప్రవేశించి మమ్ముల వెడలనడుప నుద్యమించుచుండఁ ఇంకను ఘోషా యని పీఁకులాడుచున్నారు. మాఘోషా యంతయు ఘోషచేసినాఁడు కదా! యీవిజయరామరాజు. మీ రందఱు యుద్ధమునందుఁబడి మ్రగ్గినపిదప మేము జాలవలె బ్రదికి, కోట పరిపాలించుకొందు మని యీ మష్మోటకో పంపనెంచుచున్నారు.

చ. మష్మోట కేనిఁ బంపి యవమానము కావఁదలంచినారు: క
య్యమ్మున మీరలుండ నకటా! యెట కేనియుఁబోయి మేముప్రా
ణమ్ముల నిల్పనెంచుట ఘనమ్మగునే? యదికాక మేముమా
త్రమ్మెదిఁజేసినాము నగరమ్మును వీడఁగఁ బ్రాణనాయకా!

రంగా.—(నిట్టూర్పు పుచ్చి) అయ్యో! నేను దుర్మార్గుఁడను. పాపిని. ఛీ! ఈరావువంశమ్మున కంతటికి నపకీర్తిఁ దెచ్చుటకయి యుద్భవించినాఁడను.

మల్లి.—ఇది యేమిది? కడుంగడు సంతోషింపవలసినకాలము తటస్థింపఁగా నాఁడుదానివలె వాపోయుచున్నారు. పూర్వభవమున నెంత మహోత్కృష్టమయిన పున్నెము చేసిననో కదా, ఎల్లరుఁ గొనియాడఁదగిన వీరమరణము. అందును నిట్టిసంఘాతమరణము తటస్థించును. ఇదియా! మీ పౌరుషము. లెండు లెండు: ఎల్లరకుంగూడ సమరోత్సాహంబు కలుగునట్లు రణభేరి మ్రోయింపుఁడు. మరల రేఁపటిదినంబున నీమనుమలెల్లరఁ జూతురో చూడరో ఇప్పుడే యొక్కసారి కన్నుల కఱవు దీఱఁ జూడుఁడు. ఇదిగో! మీముద్దులకొడుకు మీవంక కెట్లు చూచుచున్నాఁడో! మీయొద్దకు వచ్చుటకు చేతులు చాఁచుచున్నాఁడు. (బాలు నుద్దేశించి) నాయనా! చూడుమోయి! మీతండ్రిగారిముఖకళ. రేఁపు మరల చూతువో చూడవో?

రంగా.—(విచారముతో) తండ్రీ! చినరంగరాయా! ముద్దులపట్టీ!

ఉ. ఎట్టిముహూర్తమందు జనియించినవాఁడవొ? ముద్దులయ్య! ని
న్నిట్టులు గమ్మటంచు లిఖియించెనె? యావిధివ్రాలు! అయ్యయో!
పట్టుగ నాలుగేండ్లయినఁ బ్రాయము కల్గెనొ? లేదొ! పైని నీ
కెట్టియవస్థ వచ్చె? రిపు లేమియొనర్తురొ? నిన్నుఁ గాంచుచో.
అయ్యో! తండ్రీ! నీకింతలో నెంతగతి వచ్చినదిరా! నాయనా!

సీ. అయ్యయంతటివాఁడ వగుదం చతనిపేరు
నిడినాఁడ నిటులంచు నెఱుఁగనైతి
జను లెన్న రాజ్యపాలన సేయు దని సంత
సించితిఁ గాని యిట్లెంచనైతి
పలువురయూడిగమ్ములఁ గొందు వంచు సం
బరపడినాఁడ నిట్లరయనైతి

నను గన్న చిన్ని నాయన! నీకు నీపాట్లు
నలువ వ్రాసె నటంచుఁ దలఁపనైతి
తే. రాచవానికో! తురకలకో! చివరకు
నూడిగము సేయ నీ వుండు వాఁడవఁటర!
కొడుక వుట్టితి వేల? నాకడుపునందు
కటకటా! యిట్టిపనులు సేయుటకె తండ్రి!

వేంగ.—అన్నయ్యగారూ! మీ రిట్లేడ్చుచుండిన నాకడుపు తఱిగిపోవు చున్నది. మమ్ములనందఱ నిట్లేడ్పించుట మీకేమైన న్యాయమా?

గీ. పురుషసింహులు ధైర్యమందరమహీధ్రు
లట్టిమీరలె యీరీతి నడలువడఁగఁ
జెల్లరె! వధూనికకు నేమి చెప్పఁగలను
వలవ దుడుగుము శోకింపవలవ దన్న!

రంగా.—(దుఃఖముతో) తమ్ముఁడా! ఈముద్దుఁగూన మొగంబు చూచుచు నే నెట్లు విచార మాఁపికొనఁగలను? నాముద్దులయ్య తనకును మనుకు మారము అగు చేతులతో నాచండాలుర కూడిగము సేయవలసివచ్చుఁగదా! చూడు మోయి మా నాయన యెట్లు చూచుచున్నాఁడో! తండ్రీ! ఏల నా మొగమువంక కట్లుచూచెదవు? నీకును, నాకునుఁగూడ నీనాఁటితో ఋణాను బంధము తీరిపోవునా? హా కుమారా!

చ. కలువల నీసడించునునుగన్నులఁ గాంచెద వేల తండ్రి! యీ
తులువలు నీకు నాకిటులు దూరము సేయఁగనున్న వార లె
ట్టులిఁకను తాళుకొందును. కడుం బసిపాపఁడవైన నీకు ము
ప్పులు ఘటిల్లునంచుఁ దలపోసిన డెందము కొందలంపడున్.

తండ్రీ! నీవు లేకున్న మానెఁగాక! నీ వాతురకలకు బానిస వాడువని యోజించినకొలఁది హృదయభార మమితం బగుచున్నది. తండ్రి లేనిబిడ్డఁ డవగు నిన్ను వారేమి చేయుదురో! ఇదిగో! నినుఁ జంపి నేనే బిడ్డఁడు లేనితండ్రి నయ్యెదను. (బాలుని నఱుకఁబోవును.)

మల్ల.—(అపవారించి) ఆహాహా! ఈరేచెర్లగోత్రోద్భవుల కంతకంతకు బుద్ధి పెడతలకుఁ దిరుగుచున్నది కాఁబోలు? ఏమీ వెఱ్ఱి? మనల నింతగఁ జేసిన యాదురాత్ముఁడగు విజయరామునిపైఁ బగఁ దీర్చికొనుట కేమాత్రమేని మగపురుఁ గుండనక్కఱలేదా! ఈనాచిన్నికూనను సురక్షితముగ చామర్ల కోట కంపెదను.

చినరంగా:—ఉఁహూ! నేను తామల్లకోత యెందుకెల్తాను? నేను మాత్రం యుద్ధం సెయ్యొద్దా యేంతి?

రంగా.—(బాలు నెత్తికొని ముద్దాడి) నాయనా! నీవును యుద్ధము చేసె దవఁటరా! నీయుద్ధము చూచి యానందించుట కీనిర్భాగ్యుఁడు నోచుకొనలేదు తండ్రీ!

క. నిండుగ నాల్గేండ్లేనియు
నిండనిపసిపాపఁడవుర! నీ విట్లనన్
గుండెలు తరుగఁదొడంగె ని
త్యం డొకవగతుండు కాక తండ్రియె నీకున్?

కుమారా! దైవము మన కిప్పు డెంత ప్రతికూలుఁడై యున్నాఁడురా! అయ్యో! మనగోపాలస్వామికేని మనపయిఁ గరుణ కలుగదాయెఁ గదా!

వేంగ.—అన్నయ్యగారూ! తగుప్రయత్నములలో నుండక మీరిట్లు విచారించుచుండినచోఁ గార్యము సానుకూల మగునా? ఇప్పటికేని ముందు ప్రయత్న మాలోచింపవలదా!

రంగా.—అయ్యో! నామనము నామనమునం దుండినప్పుడు కదా! ఆలోచించుట! అది యిప్పు డిందులేక యెందో పోయియున్నది. ఇఁక నేమి యాలోచించుట? అయ్యయ్యో! చూచితివా! తమ్ముయ్యా! నాగుండె లెట్లు దరుచున్నవో! వామాక్షిస్పందనముకూడ నపశకునము సూచించుచున్నది. ఇదియంతయుఁ జూడ, మన కపజయ మనియే తోఁచుచున్నది. తమ్ముఁడా!

వేంగ.—అన్నయ్యగారూ! ప్రతాపశీలురగు తమ రీరీతిని దిగులొందుచుం డుట యేమేని యుచితముగ నున్నదా? తమరే యిట్లగుచున్న మాకు ధైర్యము చెప్పువా రెవరు?

మ. ధరణీచక్రము క్రుంగలే, దుడుల పాతమ్మేని కాలేదు, భా
స్కరచంద్రాద్యఖిలగ్రహావళియు సంచారమ్ముఁ దప్పంగలే,
దొరగన్ లేదు నభస్తలమ్మవనిపై నూహింప, హా! మంగలే
తరమా పల్కులనేటికిం బలుక నుత్కంఠన్ ధరాఖండలా!

రంగా.—తమ్ముఁడా! ఒకతల్లికడుపునఁ బుట్టినవారము. పెద్దవాఁడ నగుటం జేసి నాకు రాజ్యము వచ్చినది కాని లేనిచో నీవే రాజవై యుందువు కదా! రాజ్యగర్వమున నేను నీకేమయిన నపచారము చేసియున్నానా? నాకన్న నెక్కుడుగఁ జూచికొనుచుండెడివాఁడను. ఒకవేళ నాకెఱుఁగరాకుండ నీకేమేని యపచారము చేసియున్నానేమో? వానినెల్ల మన్నింపుమా!

సీ. అనుజుఁడా! నీయెడ నపచార మేదేని
నేఁ జేసియున్న మన్నింపుమయ్య!
అపుడప్డు నిన్నాగ్రహమ్మునఁ జూచినం
దులకు వేఱుగ మదిన్ దలఁపకయ్య!
యెఱిఁగి యెఱుంగక యేఁ జేసినట్టి దో
షములకెంతయు నన్ను సైఁపుమయ్య!
చిఱుత వంచును పనుల్ చెప్పి చేయించితిఁ
గాన నందులకయి కనలకయ్య!

తే. ఒక్కతల్లిబిడ్డలము నేఁ డిక్క డుంటి
మింక తే పేడ నుందుమో యెఱుఁగమయ్య!
లీల నొకసారి నన్ గౌఁగిలింపుమయ్య!
మమ్ము నీమానసమ్మున మఱువకయ్య!

తమ్ముఁడా! నాయొద్ద కొకసారి రమ్ము. నాప్రేమ దీఱ నిన్నొకసారి కౌఁ గిలించుకొననిమ్ము. నేఁటికి దైవము మనల నెడఁబాటు సేయ సంకల్పించి నాఁడేమో?—తమ్ముఁడా! నీయుల్లాసమున కేమేని వ్యతిరేకముగఁ బ్రవర్తించి యుండలేదుకదా?

వేంగ.—(ఏడ్చుచు) అన్నయ్యగారూ! మీ రేల నన్నిట్లు చేసెదరు? మీరు నాయెడ నేమి యపచారముఁ గావించియున్నారు?

శా. ఏలా జాలినిఁ బెట్టె దన్న! మము నీ వేలా వగంగుందె ది
ట్లేలా ధైర్యము తూలపుచ్చెద వయో! యీలీలగా నేల య
శ్లీలోక్తుల్ వచియించుచుండెదవు? మేలే యిట్టులాడంగ స
చ్ఛీలా! త్వాదృశు లైనవారలె యిటుల్ చింతింపఁగాఁ జెల్లునే?

(ప్రవేశము పటాక్షేపంబుగ నెత్తుటందోఁగుచు ధర్మారాయఁడు)

రంగా.—మామయ్యగారూ! ఏల మీరిట్లు ప్రళయకాలరుద్రునిభంగి వీరావేశంబున నెత్తుటం దోఁగుచు వచ్చినారు? మీరు పోయియుండినకార్యము కాయా పండా?

ధర్మా.—ఎప్పుడేని పండగునని నేనుమాత్ర మనుకొంటినా?

వేంగ.—ఏమైనదో సంగ్రహముగఁ జెప్పుఁడు: పిదపఁ గర్తవ్యము నిర్ణయింతము.

ధర్మా.—మీరు చెప్పినచొప్పున నే నాపరాసువానిభేటికిం బోయి, బూసీ దొరం గని నయవినయగతుల మాటలాడితిని. నే నెంత చెప్పినను వారు వినక నౌబతు మాన్పింపవలయు, కోట విడిచి పోవలయు. లేదేని యుద్ధము తప్పదని చెప్పిరి: ఆయనయొద్దనుండి నేను మరలి వచ్చుచుండఁగా దురాత్ముఁడగు నాహైదరుపంపునఁ గొందఱుతురకలు వచ్చి నన్నడ్డగించిరి.

రంగా.—ఆక్రూరాత్ముల కాయువు మూఁడియుండనోపు! లేదేని యట్లొనరింతురా? అనంతర మేమిజరిగినది?

ధర్మా.—అంత నేను వారలదుర్మంత్ర మెఱింగి,—

చ. చటులగతిఁ గటారిఁ గొని, సాహసలీలఁ దురుష్కసేన ని
క్కటిగనుఁదాఁకి యాప్రళయకాలపురాంతకుఁడో యనంగని
క్కటముగ నాయరాతులనుఁ గూల్చితి: నడ్డినవారినెల్ల దో
ఃపటిమను జూపి చంపితిని, పాఱినవారిని వీడిపుచ్చితిన్.

ఇట్లు నేను విజృంభించుటఁ జూచి హైదరుజంగును, విజయరాముఁడును బలంబులఁ బురికొల్పుచు నాపైకి వచ్చిరి.

వేంగ.—ఆదురాత్ముల కింతవెలమపోటు చవిచూపితి రదియే నాకుఁ బరమానందము. కాని, మిమ్ములఁ దాఁకిన యావిజయరామచండాలుని ధాత్రికి బలియిచ్చి వచ్చితిరా!

ధర్మా.—నాయనా! అట్లు కావలసినదే కాని, వాఁడు పలాయనుఁ డగుటఁ జేసి బ్రదుకఁగలిగినాఁడు. ఎంతమంది వచ్చినను లక్ష్యము సేయక వారల తలకాయలు వెలగపండ్లవలె రాల్చివచ్చితిని. ఎల్లవిధంబులఁగూడ యుద్ధమే నిశ్చయంబు! వారలకన్న మునుముందుగ మనమే యుద్ధప్రారంభ మొనరించితిమేని ముందుగ వారిం గొందఱఁ జంపఁగల్గుదుము.

రంగా.—మామయ్యగారూ! మిమ్ముల నియోగించితి మని యెంచక మనదళవాయుల నందఱ నొకపరి సభారంగమునకుఁ బిలిచికొని వచ్చెదరా? కార్యము చర్చింతము.

ధర్మా.—ఇట్టియవస్థలలో నాలోచించుట లెందులకు? అవశ్యముట్లే కొని వచ్చెదను. (నిష్క్రమించును.)

మల్ల.—నాథా! మీరింకఁ గార్యాలోచనమం దుండుఁడు: ఏనుం బోయి కుల్లవాని నవ్వుల కంపుయత్నంబున నుండెదను:—మనోహరా! నాజీవధనమా! నానోములపంటా! నాథా! మరల మీపాదాభివందనభాగ్యము లభించునో లభింపదో! ఇదే! నాతుదివందనముఁ గైకొనుఁడు. (భర్తకు ప్రణమిల్లి సాష్టాంగపడి పాదములు ముద్దుఁగొని కండ్ల కద్దుకొని నిలువంబడును.)

రంగా.—దేవీ! నీయునికి నాకు మఱింత దుఃఖహేతువు కావున సత్వరంబ నీవరుగుము.

మల్ల.—మీకులదేవతలు సహాయపడుదురుగాక: (నిష్క్రాంత యగును.)

రంగా.—తమ్ముఁడా! ఎంతని యూరడించుకొందు మన్నను మన మూరట చెందకున్నది. అయ్యయో! ఇంకనుఁ బెండ్లిండ్లైనఁ బూర్తిగ కాలేదే? ఈపెండ్లికంకణమ్ములే నీకు వీరకంకణమ్ములయ్యెఁగా! హా! వధూవరులారా!

గీ. అకట! మధుపర్కములఁ విడువకయె నేఁడు
ఎల్లనరులు యుద్ధమునకు నేఁగవలసె?
భావిగతి యేమి యౌనొ? ఆహా! వివాహ
కంకణమ్ములె వీరకంకణము లయ్యె.

వేంగ.—అన్నయ్యగారూ! మీ కాచింత యావంతయు నుండనక్కఱ లేదు. మా కీయుద్ధమే పెండ్లికన్న నానందజనకముగ నున్నది.

ధర్మారాయఁడు, బుచ్చన్న, వేంకయ్య, కొందఱు వీరులు ప్రవేశింతురు.

రంగా.—ఓ వీరవరేణ్యులారా! మీరెల్లరఁ బిలిపించినకార్యము సావధానులరై విందురుగాక! ఎన్నివిధంబుల సంధి ననుసంధించినను సంధి కుదరక రంధిరయే పొసఁగినది: ఇఁక బొబ్బిలిపురనాశనంబు తప్పదు. భార్యాపుత్త్రులయందు మమకారము గలవారును, ఇంకనుఁ బెండ్లిపసపుబట్టల నేని విప్పనివారును, అగువారి మాతోపాటు యుద్ధమున కూఁతము గండని పిల్వ మన సొప్పకున్నది. కావున మమ్ములఁగూర్చి మీ కేల వైరుల ఫిరంగిపరంపరల మ్రగ్గెదరు? మీ కెందేనిఁ జని బ్రదుకుఁడు.

వెంక.—మహాప్రభూ! మాకు మీప్రాణములకన్న మాప్రాణములును, ఈ పెండ్లిండ్లు నెక్కుడని తలంచుచున్నారా? అది కల్ల!

చ. తమరిడునన్నమున్ మెసవి, తామిడువస్త్రములఁ ధరించి, యు
త్తములగు తమ్ములం గలసి, ధర్మపథంబున సంచరించి, కా

లము ననుదెంచినప్పుడు బళా! మిము వీడుచు నెందో పోయి జీవము నిలుపందలంచుటకు పందులమే? తినమే? ప్రసాదమున్.

బుచ్చ.—ఇంక మేము చచ్చిపోయెద మనియు, ఏమేమిమో యనియు సెలవిచ్చుచున్నారు. అట్లే జరుగుఁగాక!

మ.మరణ మ్మెప్పటి కైన నున్నదియె వేమాట్లుండునా? మేము దేవరనుం గొల్చినవారమేకద! రణవ్యాసంగమున్ సల్ప డెప్పరమౌ తొందరఁజెందెడిన్ మనముభూపా? మీరుపోపొండుసంగరమున్ సల్పి జయుంబుఁగొండనుచుఁబల్కఁగూడదా వేరిమిన్.

వేఁగువాఁడు.—(ప్రవేశించి) దేవా! ఇంకేమున్నది? అప్పుడే పరిపంథి సైన్యంబు కోటముట్టడించి గోడలఁగూల్చుటకయి ఫిరంగులఁ బేల్చుచున్నారు. తొందరపడవలయు.

రంగా.—అన్నలారా! సమయ మాసన్న మయ్యె. అదిగో! ఫిరంగులచప్పుడు లెట్లు వినిపించుచున్నవో వినుఁడు. ఇదియే మన మందఱము తుదిసారి కలసికొనుట! ఈపటిదినంబున నేమగుదుమో? ఇఁకఁ ద్వరపడవలయు. మనము కోటలోనుండియే యుద్ధముఁజేయవలయును కాని, బయటికేఁగిన వెంటనే హతుల మగుదుము. ఇఁక సైన్యవిభాగము చేసికొందము.

తూర్పుబురుజుపయినుండి మనజెండాను, నౌబతును కాపాడుటకును, అవంకవారితో యుద్ధము సేయుటకును బాపయ్యగా రేనూఱుకాల్బలముతో నుండవలయు. దక్షిణమువంకఁ బాణిద్వారముఁ గాపాడుచు వేంగళరాయఁడు నాల్గువందలబలంబుతో నుండు. పశ్చిమదిశ బుచ్చన్నగారేనూఱుమందితో నావంకబురుజుఁ గాపాడవలయు. ఉత్తరమున మిగిలిన సేనం గొని వెంకయ్యగారు సమర మొనరింతురు. తలుపు లొకవేళఁ దెఱవఁబడెనేని, యరిబలంబునం బడి మన మందఱము సంకులసమరంబుఁ జేయుదము. ధర్మారావుగారీసేనకంతకు నధికారిగ నుందురు. ఏ సెల్లెడ

సంచరించుచు వలయుచోట సమర మొనరించెద. మామా! నాయూహ సరిగా నున్నదా!

ర్తా.—మిగుల లెస్సగ నున్నది. అప్పుడే సమర మారంభ మగుచున్నది. త్వరపడకున్నఁ గోట భేదింపఁబడును. వత్సా! రంగరాయా! ఏ నా కొన వచ్చెడిసేనావారంబులతో,—

శా. బాహాబాహి కచాకచిన్ బెనఁగి దర్పమ్మెల్లఁ జూపించి సం
దేహమ్మింతుక లేక యావిజయధాత్రీనేతసైన్యమ్ములన్
"త్రాహి త్రాహి" యొనర్చుకున్న యెడధర్త్రారాయఁడన్ గాను,నీ
దేహమ్మంటి ప్రతిజ్ఞఁగొంటిని ధరిత్రీనాథ వేయేటికిన్.—

(తెరదిగును.)

మల్లి.—వేంకటలక్ష్మీ! నీ వెంతదానవేని యగుదువే; కార్యసాఫల్యము కొఱకు మనయిలువేల్పగు గోపాలస్వామి నర్చించికొందము. ఇంత లో నీసందేశమునకుఁ బ్రత్యుత్తరముకూడ రాఁగలదు:

క. మనపాలి దేవదేవుఁడు
మనపాలింటికల్పకుజము మననిధి మనలన్
మనఁజేసెడిగోపాలుని
వినుతింపఁగ రాఁగదమ్మ; వేంకటలక్ష్మీ!

తెరనెత్తుసరికి గోపాలాలయము గోపాలస్వామి సుందురు.

మల్లి.—(చేతులు జోడించి)

శా. దేవా! ద్రోవది చింతలన్ బొగిలి నిన్ దీనార్త్యయై "ప్రోవవే రావే!" యంచని వేఁడ నామె నపుడే రక్షింపఁగా లేదె? నన్ గావన్ రావె? కృపన్ గనుంగొనవె? దీనన్ నన్నుఁ గాపాడవే? నీవే దిక్కు కదయ్య వెల్లలకు, తండ్రీ! యాపదుద్ధారకా!
దేవాధిదేవా! మహానుభావా!

శా. మావంశోన్నతిఁ గోరి నీవ యెపుడున్ బాలించుచున్నావు; ని న్నేవేళన్ మది భక్తిఁ గొల్చితిమి సామీ! నీవ కాకున్న మ మ్మేవారల్ దయఁ జూచువార లిఁక రక్షింపవే! కావవే! నీవే దిక్కు కదయ్య వెల్లలకుఁ దండ్రీ! యాపదుద్ధారకా!

వేంక.—(నిమీలితలోచన యయి)

శా. ఈవే సర్వము నిర్వహింపఁగల వీవే మమ్ముఁ బుట్టింపఁగాఁ బ్రోవంగా, లయమున్ బొనర్పఁగ నినున్ బూజింతుమే వేళఁ గా కోవే? మే మిడుసేవ లన్నియును గోర్కుల్ మీఱఁగాపాడవే? నీవే దిక్కు కదయ్య వెల్లలకు దండ్రీ! యాపదుద్ధారకా!

అశో.—అయ్యో! అయ్యో! సర్వము నాశన మైనది. ఇంకే మున్నది!

మల్లి.—వేంకటలక్ష్మీ! నీ వెంతదానవేని యగుదువే; కార్యసాఫల్యము కొఱకు మనయిలువేల్పగు గోపాలస్వామి నర్చించికొందము. ఇంత లో నీసందేశమునకుఁ బ్రత్యుత్తరముకూడ రాఁగలదు:

క. మనపాలి దేవ దేవుఁడు
మనపాలిఁటికల్పకుజము మననిధి మనలన్
మనఁజేసెడిగోపాలుని
వినుతింపఁగ రాఁగదమ్మ; వేంకటలక్ష్మీ!

తెరనెత్తుసరికి గోపాలాలయము గోపాలస్వామి సుందరు.

మల్లి.—(చేతులు జోడించి)

శా. దేవా! ద్రోవది చింతలన్ బొగిలి నిన్ దీనార్త యై "ప్రోవవే రావే!" యంచని వేఁడ నామె నపుడే రక్షింపఁగా లేదె? నన్ గావన్ రావె? కృపన్ గనుంగొనవె? దీనన్ నన్నుఁ గాపాడవే? నీవే దిక్కు కదయ్య వెల్మలకు, తండ్రీ! యాపదుద్ధారకా!

దేవాధిదేవా! మహానుభావా!

శా. మావంశోన్నతిఁ గోరి నీవ యెపుడున్ బాలించుచున్నావు; ని న్నేవేళన్ మది భక్తిఁ గొల్చితిమి సామీ! నీవ కాకున్న మ మ్మేవారల్ దయఁ జూచువార లిఁక ర మ్మాక్షింపవే! కావవే! నీవే దిక్కు కదయ్య వెల్మలకుఁ దండ్రీ! యాపదుద్ధారకా!

వేంక.—(నిమీలితలోచన యయి)

శా. ఈవే సర్వము నిర్వహింపఁగల వీవే మమ్ముఁ బుట్టింపఁగాఁ బ్రోవంగా, లయమున్ బొనర్పఁగ నినున్ బూజింతుమే వేళఁ గా కోవే? మే మిడుసేవ లన్నియును గోర్కుల్ మీఱఁగాపాడవే? నీవే దిక్కు కదయ్య వెల్మలకు దండ్రీ! యాపదుద్ధారకా!

మల్లి.—అయ్యో! అయ్యో! సర్వము నాశన మైనది. ఇంకే మున్నది!

ఇంకేమున్నది ? మానోఁచిననోము లన్నియు నిష్ఫలము లయ్యెనా ? మ
మ్మామెడివేల్పులందఱును బ్రతికూలు రైనారా ?

వేంక.—(విని) అమంగళము; అమంగళము. దేవీ ! ఇఁక యుద్ధంబున
సర్వబంధునాశన మగుటయు తప్పదు. మన మేమిచేసినను, అమంగళ
ములు. అపశకునంబులుఁ బెక్కులు కన్పడుచున్నవి.

కమల:—(ప్రవేశించి) అయ్యో ! అయ్యో ! సర్వము నాశన మైనది.
ఇంకే మున్నది? ఇంకేమున్నది ? మానోఁచిననోము లన్నియు నిష్ఫలము
లయ్యెనా! మమ్మామెడి వేల్పులందఱును బ్రతికూలు రైనారా?

వేంక.—కమలా! నీవు పోయియుండినకార్య మెట్లు పరిణమించినదో
సంగ్రహముగ చెప్పుము.

కమ.—అమ్మా! వారికి మీరిచ్చినజాబీయఁగా మండిపడి "ఏమీ ! మల్లి
మాకు వర్తమాన మంపినదా"యని "పోనీ! చదివి చూచెదఁగాక"యని
జాబు చదువుకొని "ఆహా! ఇది చాల మాయలమల్లివలె కన్పించుచున్న
ద"ని చెప్పి యిది లిఖించి మీ కిమ్మనినారు. (జాబందిచ్చును.)

మల్ల.—వేంకటలక్ష్మి: అం దేమున్నదో చదువుము విందము.

వేంక.—(జాబు విప్పి చదువును.)

చ. చెలియల: నీదులేఖ నను చేరెఁగదమ్మ: ఇఁకేల నేఁడె బొ
బ్బిలి నశియించునమ్మ: దురపిల్లకుమమ్మ: మగండు పోవునం
దులకు విచార మేటికి? నినుn గడుఁగొప్పగఁ గాంతునమ్మ: నా
వలసకు రాఁగదమ్మ: పగవాఁడను కానుగదమ్మ: మల్లమా!

కమ.—ఇది యిచ్చి యింకొకమాటకూడ చెప్పుమనినారు: "బొబ్బిలి జయిం
చి, యాకోటలోఁ బాగాకుఁ బండించి, చుట్టకాల్చకపోయినచో ప్రాత
పగలు తీరవు. ఇందులకయి విచారింపకుము. నీకు భరణముగ మూఁడు
గ్రామము లిచ్చెదను. నీ కిష్టమైనచో వెంటనే నాయొద్దకు రమ్ము;
లేనిచోఁ గోటలోఁ జిచ్చిడికొని బలవంతముగఁ జావవలసినదే కాని,
బొబ్బిలి నున్మూలింపక మానము"అని.

వేంక.—అబ్బా! మాధుండా! ఇనుమునైనను కరఁగింపవచ్చును గాని, వజ్రసన్నిభమైన నీహృదయము కరఁగినది కాదురా! మాప్రభువులఁ జంపి వారిరాణికి భరణ మిచ్చెద నని యూఁబడింతువురా!

మల్ల.—(శోకక్రోధములతో)

శా. నేనే నాపతిపాదపద్మముల హృన్నీరేజమం దుంచి, యా
భూనాథుఁ గడుఁ గొల్తునేని నృహరిఁ బూజింతునేనిఁ ననుఁ
హీనాలాపము లాడినట్టియరి సందేహమ్ము లేకుండఁ దాఁ
బ్రాణమ్ముల్ విడుఁగాక! స్వీయకులవిధ్వంసంబు నోఁ గావుతన్.

వేంకటలక్ష్మీ! నే నెందులకును విచారింపనుగాని,—

ఉ. రావుకులంబునం బొడమి, రాజితకీర్తి వహించునంచు నే
నీవెఱితండ్రి నమ్మితిన: యిట్లుగ నౌనని యెంచనైతి నిం
కేవిధి వీఁడు దక్కు మనయెల్లరకుఁ జల మీాయ శత్రువుల్
వావిరి పీనిఁ గాంచి బలవంతముగా వధియింప కుందురే?

వేంక.—అమ్మా: సర్వము నశించుటకయినే కదా! ఈఘోరయుద్ధము సంప్రాప్తించినది. ఈబాలుని జగ్గమదేవిగారియొద్ద కంపెదనంటిరే: పంపరాదా?

మల్ల.—లక్ష్మీ! ఇఁక నీవు జాగుసేయక నామున్దులయ్యం గొని, చామర్లకోటకుం జనుము. పే మందలి మాయగ్గిం బడి మ్రగ్గదము.—ఓసీ: మా తండ్రిని నీచేతులలోఁ బెట్టి యప్పగించుచున్నాను. మా నాయన నెట్లు బ్రదికించెదవో?

వేంక.—అమ్మా! మీారందఱును గతించినపిదప నేనుమాత్ర మీాభూమిఁ బయి నుండుదాననా? నేనుమాత్రము మీాతోఁ పాటిదాననుగానా?

మల్ల.—ఓసీ! అట్లనకు! మానాయన యొక్కండేని బ్రదికియుండెనా, మనయెల్లరకుంగూడ తిలోదకము లిచ్చును. వాఁడుగూడ మనతోఁ పాటైన నింక విజయరామునిపైఁ బగసాధించువా రెవరు?— అదుగో

ర్గుఁడు నాకుమారునిఁ గొనిపోవుచుండుట చూచెనేని బ్రదుకనీయఁడు కావున వీనికి బ్రాహ్మణవేషము వేసి తీసికొనిపొమ్ము. లక్ష్మీ! మానాయన మొగంబున నింతవిభూతి యలఁదవే? నాయనా! కుమారా!

సీ. కస్తూరి యలఁద నేఁ గాంక్షించితిని కాని
యిటు విభూతి యలంది యే నెఱుంగ
తలనున్నఁ ద్రువ్వి పూవుల నుంచితిని కాని
కురులెల్ల నిటు చిక్కుపఱచి యెఱుఁగ
పట్టుదుకూలముల్ గట్టనిచ్చితిఁ గాని
యిటు లంగవస్త్రమ్ము లిచ్చి యెఱుఁగ
చెలువారఁ జేరఁదీసితిఁ గాని యొరునింటి
కేఁగుమం చని చెప్పి యెన్నఁ డెఱుఁగ
ఆ. నన్నుఁ గన్నతండ్రి, నాచిన్నకూనః న
న్నేలువాఁడః నావరాలకొండ
చిన్నరంగరాయః యన్న; నిన్నెన్నఁడు
విడిచి యెఱుఁగ నెట్లు విడువనేర్తు.

చినరంగా.—అమ్మా! యేదవకే? నేనూ యుద్ధానికెల్లి అవిదయుద్ధాదుని, తురకని చిదగొత్తేత్తాను. నువ్వేడిత్తే నా కేడుపొత్తుంది.

వేంక.—అమ్మా! మీరిట్లు శోకభారంబున మునింగియుండినచోఁ గార్యభంగ మగును. పిదప నేమిచేసినను లాభము లేదు.

మల్ల.—(ఏడ్చుచు) నాయనా! నన్నుఁ గన్నతండ్రీ! నాముద్దులయ్యా!

క. నాకడుపునఁ బుట్టక యిం
కేకడుపునఁ బుట్టితేని, యీయిడుమ లయో
లేకుండుఁ గదర, కొడుకా!
నాకడుపున నేల పుట్టినావుర! తండ్రీ!

కొడుకా! నిన్నెడఁబాసి యే నెట్లుం డనేర్తు? హా తండ్రీ!

సీ. తలిదండ్రు లేరైనఁ దనయునిఁ జూడ నూ
హింతురు నా కట్టి దెట్లు కలుగు
కొమరునిముద్దువాక్యములు వింటకు నైనఁ
బెట్టిపుట్టఁగలేదె పృథివియందు
గోత్రాలినై యున్నఁ గొంత మేలుగ నుండు
నేల నా కీవుదయించినావు?
ననుఁ గన్నతండ్రి! నాయనుఁగుకుమార! నా
వరహాలకొండ! నీ బాయఁజాల!
గీ. చెనఁటిదైవము నిను వేఱుచేయుచుంట
పరులయింటికి నీరీతిఁ బంపుచుంటి
నెంతపగదాన నైతిరా! యేను నీకు
నిన్ను విడనాడి యెటులోర్తుఁ గన్నతండ్రి?
అత్త! వీఁడు నీకొడుకు కాని, నాకొడుకు కాఁడుసుమీ? ఎట్లు శత్రువులవాతఁ బడకుండఁ దప్పించి రక్షించెదవో? అది యంతయు నీదే భారము.

వరం.—అమ్మా! నిన్నొదిలిపెత్తి నే నెల్లను. నా కేడుపొత్తాంది. (యేడ్చును.)

మల్ల.—(ఏడ్చుచు) నాయనా! ఏడ్చుచున్నావా! తండ్రీ! దుఃఖపడకుము.

గీ. దుఃఖపడకుము నాతండ్రి దుఃఖపడకు
నిన్ను నీపినతల్లి నాకన్న రెట్టి
కూర్మిఁ బ్రోచును మల్లమ కువలయమున
తల్లికాదుసుమీ! నీకు దాయకాని—

(వెంకటలక్ష్మికి బాలు నందిచ్చుచున్నది.)

వెం.—(బాలుని చేకొని) అమ్మా! ఈముద్దులయ్యంగూర్చి నీవేమియు విచారింపకుము. నే నీబాలుని సురక్షితముగ చామర్లకోటకుం జేర్చెదను.

సీ. ఓరచూపులఁ జూచి క్రూరతురుష్కుల
మోహవారాశిలో ముగ్గఁ జేసి
దరహాసరుచులచే దొరలసేనల నెల్ల
స్రుక్కించి చరణదాసుల నొనర్చి
గజిబిజినడలచే విజయరాముని సేనఁ
గామాంధకారతఁ గన్నుఁ గప్పి
నునుఁబల్కుగమిఁ జిల్కి వినుచుండుకూళల
వారిలో వారికిఁ బోరుఁ గూర్చి
గీ. నమ్మకున్నట్టివారిపై నాకటారి
బఱచి చిత్రమ్ముగా భూతబలి యొసంగి
వగవగనుఁ బూని రక్షింతు వా స్తవమ్ము
నీకుమారుః విజితరూపమాకుమారు.

(బాలు నెత్తికొని నిష్క్రమించుచున్నది.)

మల్ల.—(విచారముతో) హా! కుమారా! చినరంగరాయా! నాముద్దులయ్యా! నన్ను విడిచి పోవుచున్నావా? నాయనా! న న్నెవ్వరి కప్పగించితివిరా తండ్రీ! నీముద్దుముచ్చటలు చూచి యానందించుభాగ్యము నేఁటితో నాకుఁ దీరిపోయెనా!

శా. అన్నా! చిన్నికుమార రూపజితమారా! రావు నద్వంశసం
పన్నా! ముద్దులబిడ్డ! ఆకటికి దైవ మ్మెట్టియిక్కట్టు తె
చ్చె న్నానోములపంట! ఈపయిని నీచిన్నారిపొన్నారినున్
గన్నుల్ కన్నులతృప్తి తీరఁ గనుభాగ్యం బెల్ల హా చెల్లెనే!

ఓరీ! పాడువిధాతా! నీచేత లన్నిఁటికి నీ వేమో కడు సంతసించు చుంటివి కాఁబోలు? ఇదిరోరా! నీసంతోషకారణము. నీకడుపు బిడ్డలఁ గన్నది కాదురా! తల్లిని, పిల్లలను, అన్నదమ్ములను, భార్యాభర్తల నె

కాపునియద్భుతసృష్టికి నీవే యుప్పొంగవలయు. హా! కొడుకా! (మూర్ఛిల్లి యున్నది.)

వేంకయ్య.—(ప్రవేశించి శోకముతో) కటకటా! ఈశ్రవణపుటవిదారణమగు దుర్వార్త యేనెట్లు దేవిగారికి విన్నవించెదను?

మ. కలనన్ బాహువిదారితాఖిలరిపుక్ష్మానాథులై వెల్గువీ
రులు నేఁ డిట్టులు ధర్మయుద్ధమునఁ బేరుం నిల్వలేకుండి రె
ట్టులయేనిన్ రణమందుఁ జావులోనగూడుం మాకు దుఃఖింప నం
దులకుం గాంతల నెల్లఁ జంపువిధికై దుఃఖించెదన్ శ్రీహరీ.

అక్కటా! నా కట్టిదురవస్థ సంప్రాప్తించినది? ఏ నెందుల కీక్రౌర్యకార్యా నొనరించుపనికయి, నియోగింపఁబడితిని. పాడుదైవమా! నీకేని మాకయి నిసుమంత ప్రేముడి లేకపోయెనా!

చ. కటికితనమ్ముఁ దాల్చి కులకాంతలఁ బ్రాఁకెడిచంటిపిల్లలన్
పటిమ యొకింతలేని ముదివగ్గుల గర్భిణు లాదిగాఁగ న
క్కట వధియింపఁగా వలసె కాల మదెంతటిలోన మాఱె యె
ప్పటి కిది యెట్టులౌనొ? భగవంతునిచేష్ట లెఱుంగ శక్యమే?

అయ్యయ్యో! మల్లమదేవి నన్నుం గని "వెంకయ్యా! కోట [redacted] మా!" యని యడిగిన నేనేమని మనవిచేయఁగలను?

గీ. కోటఛేదింపఁబడె శత్రుకోటిచేత
రాఁ బ్రయత్నించుచుండెఁ బరానుమూఁకి
యనుచుఁ జెప్పిన నాయమ్మ హా! యటంచు
నపుడె ధరఁ గూలుఁ దెగినపాదపముపోలె.

ఎట్టులైనను నాకార్య మొనరింపక తీఱదు. లేనిచో మేము [redacted] యుండఁగనె రాణివాసమునకుఁ జేటు మూఁడునేమో!-తప్పదు. ఇ[redacted] శోకించుచు మసలితినా కార్యభంగముకూడ నగు. ధైర్యము నవలంబి[redacted] కార్యము నిర్వర్తించెదఁగాక-(చూచి) తల్లీ! మల్లమాంబా! ఎట్టిగతి ప్రా[redacted] యినది!

మల్ల.—వెంకయ్యగారూ! ఈగడియవఱకు మనప్రభువులకుఁ గీడు వాటిల్ల లేదుకదా! సత్వరము చెప్పుఁడు.

వేంక.—అమ్మా! ఏమని చెప్పఁగలను తల్లీ!

మ. అకటా! నాలుక యాడకున్నయది; అమ్మా! చెప్పఁగా వెల్మనా
యకవాస మ్మగుకోట వ్రీలి పడె;

మల్ల.— హా! హా! శ్రీహరీ! చెప్పఁ డే
లిక కింకర్ణ గుశలమ్మె కా;

వేంక.— అగును తల్లీ! ముం దిఁకే మౌనా?

మల్ల. మా
మకభాగ్యమ్మిటులుండ నెట్లుసుఖముల్ మాకబ్బు యోజింపఁగన్.

ఆయినచో వెంకయ్యగారూ! మీరు వచ్చినపని శీఘ్రంబు నివేదించి యుద్ధరంగమునకుం జనుఁడు.

వేంక.—తల్లీ! మల్లమాదేవీ! నే నేమని మనవిచేయఁగలను? ఫరంగివారి ఫిరంగివాతలం బడి కోటతలుపు లెడమాయ నంతఁ దురుష్కాధములు లోనం బ్రవేశింప యత్నించుతఱి, మనబలంబులు వారితో సంకులసమరంబు లొనరింపవలయు నని యానతీయఁబడినవి. అప్పుడు మత్ప్రభువ రేణ్యుండు చిన్నదొరగారినిరప్పించి, వారికి రాజ్యాభిషేకంబుఁ గావించి, తాము యుద్ధంబునకుఁ జనుచు నన్నుం జేరఁబిలిచి "వెంకయ్యగారూ! అవరోధజనంబులమానంబుఁ గాపాడవలయుఁ గదా!" యని కన్నీరు గార్చుచు నొకింతసేపు మ్రాన్పడియుండి, తిరుగ దిటము వహించి, తల్లీ! ఆమాట చెప్ప నోరు రాకున్నది.

మల్ల.—అయ్యో! వారియభిప్రాయ మంతయు నాకెఱుంగవచ్చినది. భర్తగారు రాకముందు నేను స్వర్గంబునకుం జని వారికయి యెదురు చూచుచుండెద. సంగరరంగమధ్యంబునందు నిరంకుశలీల విహరించుమీయేలికతో, నాకడసారిమాటగ నిట్లు మనవిచేయుఁడు.

గీ. ఇంతచేసినయాకూళినృపునిఁ జంపి
యిలను రావుకులముకీర్తి నిలుపుమయ్య!
పగరఁ జెండాడుమయ్య! మాపై నీ ప్రేమ
మింతమఱవకుమయ్య! వెన్నీయకయ్య!

కమలా! స్త్రీజనంబు అందఱిండ్లలోనుండి, యాయిండ్లకగ్గి నిడి మ్రగ్గఁడు. మంచు దాపని కానిండు. వెంకయ్యగారూ! మీరు వచ్చి చాల తడవైనది. మీచేఁ గలకరవాల మొకసారి నా కిండు. (కత్తిఁ దీసికొని) హా! పరమేశ్వరా! మావంశంబుఁ గాపాడుభారంబు నీయది. (మేనఁ గ్రుమ్మికొని మరణించును.)

వేంక.—(ఏడ్చుచు) తల్లీ! ఆశ్రితజనకల్పవల్లీ! మమ్ముల బాసి వెడలిపోయితివా? నీమనోనాయకున కీనీదుర్మరణవార్త యే నెట్లు వినిపింపఁగలను? (శవలు పరికించి) హాహా! ఎంతకష్ట మెంతకష్టము? బొబ్బిలిపురంబునం గలకాంతాలోక మాబాలగోపాలంబునుగూడ నిండ్లకుఁ జిచ్చిడికొని యందుం బడి మ్రగ్గుచున్నారు! (క్రోధముతో) ఓరీ! విజయరామనరాధమా! మాకింతయొగ్గుఁ గావించిన, నీ వింక నెన్ని నాళ్లు భూమిపయి నుండఁగలవురా?

శా. క్రొం డెంబుల్ పచరించియాతురకజంగుల్ జేబులో వైచి; మూర్ధుండా! యీగతి నీయఁబూనెద వెటాలాడూ యాదిగాఁగల్గుదో; శౌండుల్ మామకవిక్రమానలమహాజ్వాలాళికిం దక్కి చాకుండన్ నిల్చెడివార లెవ్వ రిదె? కన్గో వచ్చెదన్ తాళురా!

(సపటాక్షేపముగ నిష్క్రమించుచున్నాఁడు.)

---

రంగము-యుద్ధభూమి.

(తెరలో) ధర్మయుద్ధపారీణులగు నోదండనాథాగ్రణ్యాదిసకలాప్త సైనికులారా!

సీ. నిఖిలశాస్త్రవగర్భనిర్భేద మాశేవ
వాయింపుఁ డయ్య నౌబతును విడక
నిస్తంద్రకీర్తిచంద్రిక లెల్లెడ వెలుఁగ
ధను వూని యనికి సిద్ధమ్ము కండు
ఛురియ లీఁటెలు పటాల్ పరశు లాదిగ నెల్ల
యుద్ధోపకరణమ్ము లూని నిలుఁడు
తఱి యైనతఱి మహోత్తరబాహుశక్తిని
యుద్ధంబునకు నేని సిద్ధపడుఁడు
తే. హారులఁ గరుల శాస్త్రవపరంపరలపైని
పఱచి వారలఁ జీకాకుపఱచవలయు
పెద్దలు బలాఢ్యు లనునట్టిపేరు మీరు
కలన మీశక్తిఁ జూపించి నిలుపవలయు.

మఱియు నోశూరవరేణ్యులారా!

ఉ. పాఱినవారిఁ జంపకుఁడు పంతమునన్ రిపురాజి నొంపుఁ డె
వ్వారిని లెక్కసేయకుఁడు వారక కీర్తి నిల్పుకొండు సం
సారముపై నిఁకాశల విసర్జన సేయుఁడు వెన్నుఁ జూడుఁ డె
వ్వారికి వెన్నుఁ జూపకుఁడు పౌరుషమున్ విడనాడఁబోకుఁడీ!

హాసైను.—(సప్రహారుఁ డయి ప్రవేశించి) హారే! అల్లా! అల్లా! మాఖి యెన్నిఖోటల్కి ముట్టడించామ్! హెంద్రి రాజుల్కి సంప్నామ్! హిట్టాయుద్ధం మాఖి పుట్టినూడ్ లేవ్. లడాయ్‌కి హై జాయేగా! ఖోడగోడ్కి నిఛ్ఛా యేసి మాఖి హెక్తాహుంటే భాబ్లీహాడూ మీద్ నించి హంబ్లీ పోసేవ్! మాదీ హాఖీరెండూ హాంట్కపోయేవ్! మాదీఘుర్కి పరారీ సెప్తాహుంటే, ఖాగ్తా హుంది తేల్ హాదీ పోసి రోల్ఖి రోఖల్కి మీధా యేసి మాఖీ సంప్తార్ హాళ్లూ! భాబ్లీఖోట్టి హాక్డ మంచిఅవురత్‌కి నిఖా సేసి హాదీ హైదామ్ మాఖీ హాలో

స్నా! పాదీ గీదీ దైభంకి తెల్సు. మాదీ భత్కి హింట్కి పోతే పాల్!

సూరపరాజు (ప్రవేశించి) ఆహా! ఈవెలమలయుద్ధకౌశల మత్యద్భుతము కదా! వారిబాణముల కీతురకసేన గుటియగుచు గుదులుగుదులుగఁ గూలుచుండుట తక్క వీరి యాగ్నేయాస్త్రములకు వారొక్కరిద్దరు గుటి కాకున్నారు. ఫిరంగు లుండుటచేఁ గోట భిన్నంబైనది కాని, యింకను విజయముఁగూర్చి శంకిలవలసినదే? నలువంక లొకసారిచే ముట్టడింపఁబడ, వారుకూడ నున్నసైన్యము విభజించి మఱియొక్కని సరాసరిగఁ బోరుచున్నారు.

హాస్సే:—సూర్నారాజా! హెఖ్దానిండి వస్తావుంది. మీధీ ఆడాయీఖి రెల్లాలేద్! శేఖ్ పోతే పరారీ సెప్తార్.

సూర:—సాహెబులా! మీరుకూడ యుద్ధతలంబునుండి వచ్చి విశ్రమించుచున్నారు కాఁబోలును?

తెరలో—

ఉ. బొబ్బిలివీరులార! తలుపుల్ పడె నంచు గణింపకుండు మీ
యబ్బలపేరు నిల్పుఁడు యశోర్థులు కండు రణంబునందు మీ
యుబ్బును జూపి శత్రువుల నుక్కడఁగింపుఁడు; ప్రబ్బువేడుక
దుబ్బెలు కాఁగ జీవములతోఁ బరి శత్రులఁ జేరనీకుఁడీ!

హాస్సే:—సూర్నారాజా! బడామేఘంలాగ పబ్దం సెప్తాహుంది. హాదీ బాత్ హింటే మాదీ గడ్గడా గడ్గడా హైతుంది. హోదూ హిఖ్దాఖి హాతాహై మాఖీ మార్నేకు నూష్టాడ్ తోస్తుంది. మంది ఖర్చ్ పోతావ్. అవ్.

సూర:—ఇంతసేనన్ జించికొని వాఁడిచ్చటి కెట్లు రాఁగలఁడు? అందుల కయి మనము భీతిల్ల నక్కఱ లేదు కాని నీవేమైన యుద్ధవిశేషములఁ గనిపెట్టితివా? ఇంతదనుక నీ వెవరితోఁ బోరాడుచుంటివి?

హాస్సే:—మాఖీ బకాల్ పేట హుందీ లేవ్! హఖ్దాఖి యుద్ధంఖి

పోయేవ్: బకాల్ బీబీ! హాడూ హేడ్డిహేడ్డి తేల్ తెచ్చి, మాదీ అప్క ర్ హొంక్ష్టేధా యేస్తే, అం క్యాబోల్తా! సెడ్డాన్కి పరమ్ హైహతుంది.

సూర:—జరిగినది చెప్పుకొనుటకు మన కేమిసిగ్గు? చెప్పుము.

హాస్సే:—హాళ్లూ తేల్ తెచ్చి పోసేవ్! హాంబ్లీ పోసేవ్! రోకళ్లూ తిర్గళ్లూ రోళ్లూ హాంతా పోసేవ్ హాడ్కి ఖోట్టాల్‌మే బందూక్ హెత్తేమ్. ఏక్ బొమ్మారాక్ సీ హుండీ పిశాసీ చేరీరాంఖా, బడే రోఖల్కి పట్కోని ల ష్కర్‌కి లట్‌పట్ సెప్పింది. ఖోట్టాహుంటే రఘుతం ఖాల్యా పారింది. ఏక్ బకాల్ బీబీ మాదీ అఖీమిాధా హాంబ్లీ పోసేవ్! వర్గుండా సల్లేవ్! మాదీ అఖీ హాంట్కాపోతే హాడ్రు ఘర్తే పరారీ సెప్పి మొఖ్ము ఖడ్గి హిఖ్ఖాఖి వచ్చేం.

సూర.—కోమటియాఁడువాండ్రే యీరీతిగఁ బోరినారా? అయినచో మాతోఁ బోరిన కాపువాండ్ర పౌరుషముఁగూర్చి యబ్బురపడ నక్కఱ లేదు.

హాస్సే.—ఖాపూహాడూ మిాతో హెట్టా యుద్ధం సేసేడ్ బోలో.

సూర.—మేము కాపుగూడెమువంక వారితో యుద్ధము సేయుటకు నియోగింపఁబడి, యావంకకుఁ బోవుసరికి వారు నాఁగలి నక్కు మొదలగు కర్షకోపయోగమగు సామగ్రిఁ బూని తలపడిరి. ఆఁడువాండ్రు కోకలు పిరిచుట్టుగ మల్లఁగట్టి, మహిషాసురమర్దినిని దలపించుచు, మనసేనఁ జెండాడినారు. వారిపయికిఁ బోయిన మనఅయిదువందల మందిలో, ఏ పదిమందిమాత్రమో బ్రదికినారు. తుపాకిమందు ప్రయోగంబున వారి నెల్లఁ జంపఁగల్గితిమి.

•స్సే.—నూర్సారాజా! బకాల్ బీబీకి యుద్ధం సెడ్డం మాఖి హాఖ్ఖా నూశైద్ హాండీ! బకాల్ పిర్కి సెప్తార్ మాఖీ హై బోల్తా మాదీ పిర్కి.

తెరలో

కోటలోను పేటలోనూ సాయెబయ్యా
మేం కూడుకొని తిరుగుతాము

చేతులైనా సూస్తాము సాయేబయ్యా
మంచి జ్యోతిషము సెప్పుతాము
పెద్దయింటిబిడ్డలము సాయేబయ్యా
మమ్ము కొద్దిగాను చూడకండి
ఉన్నమాట సెప్పుతాము సాయేబయ్యా
మేము లేనిమాట సెప్పఁ బోము.

గూస్ప.—మూర్ఖారాజా! దేఖ్ దేఖ్! సిల్కా ఫిట్టాలాగా గిల్కా గిల్కా సప్డా సేస్తూ ఏక్ కంచెన్ వస్తావుంది. కోయ్లాలాగా కుయ్ కుయ్ మంటూ మాచ్చా గానం సెస్తాది. మాది యిన్నాం మాఖి సచ్చింది భత్కిందీ తెల్వాద్? దాన్కి మాది నిఖా సేసి షాదీ హైతామ్ జీ!

నార.—దానివెంట సెందలు వచ్చుచున్నారో చూడుము. ముందుగ వారి నందఱ సాగనంపితివేని యది నీకృత్యమున కనుమతించునేమో?

వేంకటలక్ష్మి బాలు నెత్తికొని ప్రవేశించును.

సొగసుకాఁడవు నువ్వు-సాయేబయ్యా
నన్ను వగ నేలికోవోయి సా.
నిన్ను విడువఁ జాల సాయేబయ్యా
నేను నిన్ను పాయఁ జాల
కన్నెపిల్లను కాని సాయేబయ్యా
నే నెన్న పెద్దదాన్ని కాను
తాళఁజాలను నేను సాయేబయ్యా
నేను బేలపిల్లను కాను
ముద్దిచ్చి పోవోయి సాయేబయ్యా
నీవద్దఁ జేర్చుకోవోయి
రవ్వ సేయకోయి సాయేబయ్యా
నాయవ్వనము నీదోయి సాయేబయ్యా.

వెనుక గంతులు వైచుచు యాకూబ్ జానూ ప్రవేశింతురు.

యాకూబ్.—దేఖో జానూ ఇది కంచెన్ మెల్లామెల్లా మన్కి తీప్‌మాటా సెప్పి ఛళ్లేకు నూస్తాది తోస్తావ్ భాయ్! హింక మన్ము ధీన్ని హొద్ది హొయ్కి నిఖా సేసి కంచెన్కి సెప్తామ్:

జానూ.—యాకూబ్! దేఖో హిఖ్ఖ హాస్సేన్ సూర్పారాజ్ హున్నాడ్: హొళ్కి నూస్తే యిది మోఘిస్తార్ తోస్తావ్ నాఖీ!

హాస్సే.—సూర్పారాజూగారూ! దీంది సోక్ తమాసా దేఖో! షిల్కా లాగా రైకా తొడ్గి సెమ్లిపిట్టాలాగా ఖోకా కట్టి, ముఖ్ఖుముత్తెం, ఆఖీకి ఖాటూక్ సేత్కి ఘాజ్ నద్మూఖి హొడ్డాణో యేసి, మీదీ బెంహాడైభం మన్మధుడ్డూ ఖుల్సి షింగారంఖుపొ్ప సేసి దీన్కి సేసేవ్: మీదీపామ్‌కి సలామ్ సెప్తామ్: మాఖి పాదీ సేసోక్కి ధాన్కి సెప్పండి?

శూర.—మూఢుండా! నేనేమి నీకు కుంటెనకాడ ననుకొంటివా? ఇటువంటిపనులకు నియోగించుచున్నావు. (నిష్క్రమించును.)

వేంక.—(తనలో) వీరందఱు నావిలాసవారాశిలో మునిఁగి యున్నారు. వీరికిప్పుడు, మోహము తలకెక్కఁజేసి చతురగతిఁ దప్పించుకొని నిష్క్రమింతుఁగాక! సాభినయముగ నొకశృంగారగీతికఁ బాడి మైమఱపించెద. (ప్రకాశముగ.)

నీకు నాకు యీడు జోడుసాయేబయ్యా
పలుగాఁకిమూఁకవంక చూడు సాయే.
అక్కుఁజేర్చి ముద్దుమోవి సాయేబయ్యా
వేడ్క నొక్కి రుచి చూడుమోయి
మారుబారి కోర్వఁజాల సాయేబయ్యా
నిన్ను కోరియున్నదాన చాల
ఏల ప్రేమ రాదు నీకు సాయేబయ్యా
నన్నేలవేల జాలమేల

హాస్సే.—కంచెన్! నిదిపామ్కు సలామ్! మాఖి హిట్టా సూడు. నిఖి నిఖా హైతామ్. నిఖి పాదీ సెప్తామ్:

వేంక.—సాయెబుగారూ! నన్నేమి చేయుమందురు? వీండ్రందఱు నన్నీరీతిఁ బొదివికొని యుండ నేనేమి చేయుదును? ఈతురకలు ముందు పంపివేయుఁడు. నాకును మీకును—

హాస్సే.—క్యా యాకూబ్! నిఖి లడాయ్‌కి పోకా యిఖ్డాఖి కైసా వఛ్ఛావ్! జావ్! బద్మాష్! మీదీ వచ్చి అవురత్ ఖి హల్రా సెప్తావ్:

వేంక.—ఏమండోయి సాయెబుగారూ! మీరు వచ్చుచున్నా రని వచ్చుచుండ వీఁ డిట్లనుచున్నాఁడు. ఏమైనను సరియేకాని, మీరు మమ్మలను వదలిపోకుఁడీ:

యాకూ.—హాస్సేన్ సాబ్! మీది లడాయ్‌కి యెల్లండి. మాదీ పాలా హాల్సి హుంది.

హాస్సే.—తుంబీ జావ్. (ఇరువురు కలియఁబడి కొట్టుకొనుచుండ వేంకట లక్ష్మి నిష్క్రమింప యత్నించును. జానూ అడ్డును. లక్ష్మి బాఁకుతో వానిఁ బొడుచును.)

యాకూ.—హల్లా హల్లా! హిది అడ్‌మన్సి కొద్రా బాబూ! డెభైపదో క్రొండుమంది మొగ్గి హుంది తోస్తుంది. హిది పంగ్తి బున్సీకి షిప్పి, హిఖ్డాకి తెచ్చి హుస్సేన్ గాడ్కి పంపిస్తామ్: హీడ్స్మిదా దీన్మిదా కుట్టర్ షిప్పి కైవ్ సెయ్‌వాలా. (నిష్క్రమించును.)

హాస్సే.—హామ్మా! హీళ్లు పరారీ సెప్నార్! అవ్! మందీ ఘుర్మెపోదామ్:

వేంక.—ఒరనుండి బాఁకు దూయనేదూసితిని. వీనిఁ దెగటార్చి నాదారి నిరాటంకముగ చేసికొనియెదను. సాయెబుగారూ! రండు. (పొడిచి చంపును.)

కరలో.—పిపానీ హాడ్డీ హాంద్రీఖి పంపిపోతాహుంది. పగడో! పగడో!

వేంక.—వీండ్రందఱు నన్నుఁ బట్టుకొనుటకయి వచ్చుచున్నారు. అదిగో! బూసిదొరకూడ వచ్చుచున్నాఁడు. ఇంక నే నెట్లును తప్పించుకొనఁజాలను కాన, యిందుండి నిజము నివేదించెదను. పైని దైవ మున్నాఁడు.

హైదరు. బూసి. విజయరామరాజులు ప్రవేశింతురు.

బూసి.—ఆఁడుదిరయే యింతమందినిచంపినదా? అయినచో నామె యెట్టిదో; ఏపనికయి పోవుచున్నదో కనుఁగొని తీఱవలయును ?

హైద.—వాళ్లూ మంత్రాంగం శెప్పి బచ్చాఖి తీస్కు-పోతార్ తోస్తుంది. హేల్నీ హారూ హాది పరీచ్ఛ్ నేసి సంస్థాన్కి- హుకుం దేదియా.

బూసి.—(చూచి) ఔరౌరా! జగాకడాని వెలుంగు డీలువడఁజేయుచు నిండుచందురు గేరుమోము ముద్దులు మూటఁ గట్టునికుఱ్ఱఁ డెవ్వఁడై యుండు. ఆహా! ఇట్టివానిం గన్నవాఁ డెంతపుణ్యము చేసినాఁడో కదా!

వేంక.—(తనలో) ఇతఁడే బూసిదొర యయి యుండు. (పైకి) సలామ్! మూసాబూసిదొరవారికి; నాయనా! చినరంగరాయా! దొరగారికి సలాము చేయుము.

హైద.—హీది ఛిన్ రంగ్రావ్ హుంది. బొబ్లీఖి బచ్చా:

చినరం.—బూచీ దొలగాలికి తలాం.

బూసి.—అమ్మా! మీ రెవ్వరు? ఏమికతంబున నీబుడుతనిఁ దీసికొని యిట్లేఁగుచున్నారు? మిమ్ములనుఁ జూచినకొలఁది జాలి వొడముచున్నది. దాఁచక చెప్పుఁడు.

వేంక.—అయ్యా! ఇంతకు వచ్చినపిదప నిఁక దాఁచ నేమిటికి? నిజము చెప్పెదను. పిదప మీయిచ్ఛకు వచ్చినరీతిని చేయుఁడు. ఈకుఱ్ఱవాఁడు బొబ్బిలిపురీశ్వరునికుమారుఁడు. నేను వారిదాదినగు వేంకటలక్ష్మిని.

బూసి.—అయినచో వీని నెక్కడకుఁ గొంపోవుచున్నారు?

వేంక.—మావఁగనులగు మావా రపజయము శంకించి, కొంతఅను,వృద్ధులను,

బాలురను ఇండ్ల నుంచి చిచ్చుంటించి చంపిరి. వీనిం జామర్లకోటకుం గొంపొమ్మని నా కొసంగిరి. నేను గూఢభంగిఁ బోవుచుండ నిట్లైతి. (దుఃఖించుచు) తండ్రీ! ఎటులేని యీబాలుని రక్షింపవలయు నని మీపాదము లాశ్రయించుచున్నాను.

చినరం.—లచ్చిమీ! రేదవకే మనకేంబయం.

బూసి.—బిడ్డా! నీ వెవరికొడుకవు?

చినరం.—నేను దంగాదావుగాలికొదుకిని.

బూసి.—నీ వెక్కడకు పోవుచున్నావు?

చినరం.—మానాన్నగాలూ, అమ్మగాలూ యుద్దానికి పోవద్దని చామర్లకోత పంపుతున్నాలు.

బూసి.—నాయనా! రమ్ము! ఈయరటిపండుం గొనుము.

చినరం.—అలితిపం దెందుకు నాకు? కత్తియ్యంది.

విజ.—దొరగారూ! బొబ్బిలివారివిక్రమ మిప్పుడేని మీ కెఱుంగవచ్చుచున్నదా?

బూసి.—బిడ్డా! బాలుఁడ వగుని వాక త్తితో నేమి చేసెదవు?

చినరం.—బూసీదొలగాలూ! మానాన్నగాలిమీదికి యుదయుడామలాజా యుద్దాని కొచ్చేత్త! అంచేత ఓచిన్నకత్తిత్తే ఆలాదుని చంపేసి వొత్తాను. చిన్నకుల్లాల్లాగ అరితిపందు నాకెందుకు?

విజ.—తెలిసినదా? వీనియభిప్రాయము. ఇఁక వీని నొకదోసెఁగ కాలిక్రిందఁ ద్రొక్కించవలయు. బ్రదికియుండెనా మనకే సాహసమగును.

బూసి.—(కోపముతో) ఓరోరి రక్కసీ! ఏది బిడ్డలఁ గన్నకడుపు కాదురా! ఈకసికందు నీ కేమిచేసె నని చంపు మనుచున్నావు? ఇటు లాడ నీకు నోరెట్లు వచ్చినది? ఇంకిటు లంటివా నీనాలుక చీలికలు చేయింతును.—దాదీ! నీ వేమియు నడలకుము. ఈబుడుతని కేమియుఁ గీడు రాకకుండ

నాగుడారమునం దుంతు! సేవకా! ఒక అందలమ్మున నీబిడను, ఈకుఱ్ఱ వాని నంచి నాగుడారమునం దుంచుము. జాగరూకతగ వీరిఁ గాపాడు చుండవలయు. (తెరదిగును.)

---

## రంగము - యుద్ధభూమి.

నాగోజీరావు, హైదరుజంగు ప్రవేశించుచున్నారు.

నాగో.—యవనేశ్వరా! ఇం దింతవిశేషముగ నబ్బురంపడ నక్కఱలేదు. ఎన్నఁడేనిఁ బులికడుపునఁ బులిపిల్ల కాక పిల్లిపిల్ల జన్మించునా?

హైద.—హాఁ జూ నట్టాన్కి హిమ్మతు హులన్నాడ్ లేవ్రా! కత్తిహియ్! మూఖి హిజ్యాఖి సంప్తే హంటూ హెంత జల్ది హోచ్చేడ్ హోయ్: పిస్తోల్ ఖుద్పు ఫిరంగ్ పుట్టింది తోస్తాది మాఖీ.

నాగో.—కుఱ్ఱవాఁడైనను సాహసముఁ గొనియాడఁదగినదే? అందుచేతనే కదా! రాజు వానిఁ జంపుమనిచెప్ప దొరగారు రక్షించి యీనిం డిట్టుల బాలకునిఁ దమసొంతగుడారమునం దుంచికొనినారు.

రంగారావు రక్తసిక్తాంగుఁడై కత్తిఁ దూసికొని ప్రవేశించుచున్నాఁడు.

రంగా.—(క్రోధఘూర్ణితుఁడై) ఓరోరి తురుష్కహతకులారా! ఏడీ! దుర్మార్గుఁడగు హైదరుజంగు మిత్రభ్రమం బొందున్నాఁడో నాకుఁ జూపుఁడు. వానిం బెగనేసినదాఁక నా కీరణోత్సాహము తీఱకున్నది. (అటు నిటుఁ దిరుగుచు హైదరును గానక) ఓరోరి యవనహతక! దుర్మంత్రాభిలాషీ. నా కగపడకుండ నీ వెం దడఁగి యున్నావురా?

శా. ఓరోరీ! యవనాధమా! చటులసారోగ్రాజిలో నుండ కీ
తేరా మాటున డాఁగి యుండితివి? నీకే శౌర్యమే యున్న రం
గారాయాగ్రణి వచ్చినాఁ డతని సంగ్రామమ్మునం దోర్చి నీ
బీరమ్ముఁ నిలఁ బెట్టికొమ్మవనిలో విఖ్యాతి తీండ్రిల్లఁగన్.

సీ. ఎదిరిశక్తి యెఱుంగక తెంచులాడూను
కుంతధారాహతిఁ గూల్చినాఁడ
బిరుదు లగ్గించి పైఁ బఱచులానూఖాను
నతనికిఁ దోడుగా నంపినాఁడ
అద్దిరా! యని వచ్చుసిద్దిబిలాలు మైఁ
జెండి భూమీస్థలిఁ జేర్చినాఁడ
బంద్రాయివలె వచ్చుజంద్రాల్మహమ్మదు
నీల్గించి భూబలి యిచ్చినాఁడ

తే. వ్రాని షుకురుల్లఖాను హుస్సేను మొదలు
తురకజోదులఁ బెక్కండ్రఁ ద్రుంచినాఁడ
హైదరొక్కండె మిగులఁబో లాతఁ డెందు
నక్కియున్నాఁడొ యెఱిఁగింపుఁ డక్కడంతు.

నాగో.—పొరశికేశ్వరా! అడిగో! హరిణముపైకి దూఁక లంఘించు బెబ్బు లియటుబ్బున బొబ్బిలిబెబ్బిలి, కనుల నిప్పు లుఱుల, దుశ్శాసనవధానంత రంబున దీపించుభీమసేనునిపోల్కె మిమ్ముఁ దాఁకుటకయి వచ్చుచు న్నాఁడు.

హైద.—నాగోజీరావ్ ! మేరాదిల్ హంతా ఘుందర్ గోలం హైంది. ఇ చ్చానక్ ఖి సంపేం హంటే వంకాయ్ వస్తావ్ ! వంకాయ్‌కి సంస్తే మత్తే ల్ పాపయ్ హంటావ్ ! హాడ్కి మర్గయా సెప్తే దమ్మాయ్ వస్తావ్ ! హెం ద్రూ హెం ద్రూ హున్నార్ హోయ్ భాబ్లీహాళ్లూ ! రొయింక్లొఇస్టే హొచ్చి హిశ్యాదె ఖైమంది సంపింది. హాడోడూ యుద్ధం సెప్పి మెండ్ల యుద్ధం సెప్సి మాఖీ సంప్తార్ తోస్తుంది. హొంటినిండా రఘుతం యేసొక్కని భుద్రూభుద్రూహోస్తాడ్ భానంలాగా యీడు. సిద్దీబిలాల్, మానేసవాల్, షుకురల్లీ, హాస్సేన్, లాడూలానూహీడ్కి యొద్రి సొచ్చి మర్గయా సెప్పేర్ బోల్తా హీక మాది హొంతు వొచ్చింది. మాఖీ పో వాల :

తాన్.—యవనేశ్వరా! నేను మొదటనే మనవిచేసి యుండలేదా? వెలమల పౌరుషము.

గీ. మత్తపరిపంథిభూమీధరాత్తసర్వ
గర్వనిర్వాపణోద్యోగదోర్విదళిత
శీర్షభవరక్తమజ్జనామర్షు లరయ
రావువా రని చెప్పనే వేవిధముల:—

రంగా.—(హైదరుజంగునుఁ గాంచి) ఓరీ! వృథాశస్త్రబలభరా!

శా. ఏమీ! భీతిని నక్కియుంటి విట! ర మ్మాశిక్షింతు నీబీర మ
త్యామోదంబున; అన్యపాలునకు మూఢా! కోట యిప్పింతు వే
బీరా! మాటాడక యుంటి వేమి? నృపులో నేమేమి యోయంటకా
దీమా వెల్మలకత్తిదెబ్బ లనఁగా నెట్లాఁగెదో కాంచెదన్:—

ధూర్తా! రణవిహారంబు సల్పక యింకను తాళియుంటి వేమి? రారమ్ము:

హైద.—యెల్లామస్సి! నీకు పౌరుసం వుంటే లడాయీకు నూవ్ హోయ్; పెద్దపెద్దాకుబూరి సేస్తావ్. మాదీపటాణిదెబ్బల్కి నీకు మాలుంహై తో ఖుంది. హావీరిధగ్గ్రాఖి పోయ్ హద్దు:

రంగా.—(హేళనముగ) మాకుఁ దెలియకపోయినచోఁ గదా! ఎవరియొద్దకుఁ బోయి కనుఁగొనుట; నీబలవిక్రమంబులు మాయెల్లరకుంగూడ కరతలామలకంబులే? నీ వప్పుడే మఱచిపోయితివి కాఁబోలును! తెలియఁజెప్పెద నందుము.

సీ. అనదలై యుండెడియవనీశ్వరుల నెల్ల
జంకక త్రుటిలోనఁ జంపఁ గలవు
లీల నీయానతి మౌళిఁ దాల్చెడునట్టి
పుడమీశుపై దాడి విడియఁగలవు
మానమే ధనమైన మానినీమణులఁ జి
క్కులు పెట్టి వారితోఁ గలియఁగలవు

నింద్యకర్మముల నెన్నిటినేనిఁ గావించి
లంచముల్ పెక్కుగా లాగఁగలవు
తే. అనృతవచనము లెన్నేని యాడఁగలవు
బిడియమును సిగ్గు నీరెండు విడవఁగలవు
చెనఁటికార్యము లెన్నియేన్ జేయఁగలవు
ఈవు సలుపఁగలేనిదుష్కృతులు కలవె ?
మఱియు నోరిగోమాంసభక్షకుఁడా !

కవి. తగుదు నటంచును హ్రీ విడి మమ్ములఁ
దాఁకఁగ వచ్చితివా యిటు బల్
మగఁటిమి యించుక కల్గినచో నను
మార్కొని సంగరరంగమునం
దగపడఁ జేయుము నీబల మంతయు
నంతియె కాని యిటుల్ వచియిం
పఁగ నిసుమంతయు లాభము లేదిఁక
వాగక నూరక యుండుమురా !

హైదర.—(కోపముతో) ఖి ఖి నోట్కి హెంతావ స్తే హంత పేల్తావ్ బద్మా
ష్! మాదీ పటాణిభీరం ఖిఖి హేమ్ తెల్దు! హై అబీ బోల్తా! సునో:

గేయము.

ఖల్బుర్గి ఖొట్టేం ఖటాక్నిక్ నెట్టేం
హోర్కాటు పట్నానిక్ హాగ్గీలో ఫెట్టేం
ఫాల్కొండ ఖాల్చేం ఘోల్కొండ పేల్చేం
హైద్రా బాద్‌హాల్లో మేం హంకట్లో నిల్చేం
ధొడ్డోర్ని సూసేం ధొన్లాఖ సేసేం
మామాట యిన్నోర్ని మట్టీలో యేసేం

నిన్ను పట్టేస్తాం నీఖ సంపేస్తాం
సీరాజ్జెం మావిజ్యరాజాఖి యిస్తామ్.

దేఖో: మాది తుర్కా పాడితడాఖా:

రంగా.—(మహోగ్రహముతో) ఔరౌరా! ముష్కరతురుష్కాధమా! ఎదిరితరంబును నీతరంబునుగూడఁ దెలిసికొన నేరక మాట లాడుచున్నాఁడవురా! తాళుము తాళుము. తాళఫలంబుఛాయ నీశీర్షంబుఁ ద్రెవ్వ నేయుచున్నాను. నన్ను నిర్జించి నారాజ్య మావిజయరామరాజునకు కిచ్చెదవో? ఓరీ! మహాపాతకవర్తీ!

(ముందునకు హైదరును లాగుచు) అసంబద్ధప్రలాపీ! రారా! నీకొందువుగాని,—

క. తురకలకుఁ బుట్టి తేనిన్
బిరుదించుక యుండెనేని బిరుదివియక సం
గరమున నన్నోర్వుము నీ
బిరుదుమగంటిమిని నేఁడు వీక్షింతు నిటన్.

(హైదరురంగారాయల ద్వంద్వయుద్ధము, కొందఱు తురకవీరులు వచ్చి రంగారాయనిఁ దాఁకఁ, గొందఱఁగూల్చిరంగారావు మూర్ఛిల్లి తెప్పిరిలి.)

రంగా.—తమ్ముఁడా! వేంకటరాయఁడా! ఎదుంటివోయి?

శా. ఏ డీకొంటిని హైదరున్ గదనమం దెంతేని నాశక్తిఁ బో
రాడం గల్గితిఁ బ్రాణముల్ నిలుపఁగా నాసింపకుండంగ వే
రా! డీకొమ్ము జయమ్ముఁ గాంచు మిదె! వీరస్వర్గ ముం జేరుచు
న్నాఁడన్ నీవును ధైర్యమున్విడకసంధానింపుమాయుద్ధమున్.

(ప్రాణములు విడుచును.

హైద.—(కాలఁదన్ని) బద్మాష్‌రాజా! మాఖి లుచ్ఛామాటల్కా బోల్తావ్: మాదీ ముసల్మాన్కే హచ్చా పౌరన్ నీఖి హిమ్మ మాలుమ్.(నాగోజీరాయనితో నిష్క్రమణము)

వెంగ.—(తెప్పిరిలి శోకముతో) హా! సోదరా! నన్నుం బాసి దివంబున కేఁగితివే?

ఉ. ఎవ్వని కప్పగించితివి? ఈవు సదా దయఁ జూచునన్ను నిం
కెవ్వని కప్పగించితివి? ఈవు వధూనికః నీకుమారు నిం
కెవ్వని కప్పగించితివి? ఎల్లపుడుం నినుఁ గొల్చువారి నిం
కెవ్వని కప్పగించి దివి కేఁగితివో వచియింపు మగ్రజా!

వెంక.—(విని శోకముతో శవముపైఁ బడి) హా! బొబ్బిలిపురసింహాసనాధ్యక్షా! రంగారాయన్నృపాలచంద్రా! హాపద్మనాయకవంశమణీ! హా! మమ్మెల్లరఁ దిక్కుమాలినవారిం జేసి పోయితివా!

సీ. మా కేదిగతి చెప్పి మ మ్మెల్లరఁ వీడి
దివి కేఁగినాఁడ వుదీర్ణచరిత!
చెల్లఁ బో! బొబ్బిలిసింహాసన మ్మెవరి
కప్పగించితివి? తుభ్యద్విరోధి!
ఆ ప్తబంధువుఁడ! నీయుండ జేరితి మాటు
పలుకవే మింటికి? భూపాలచంద్ర!
అరుల నుద్ఘాటింప నరుగు దేరక యిట్లు
పడి యుంటి వేల? దిగ్వ్యాప్తకీర్తి!
తే. వెడలి రావేల? శత్రులఁ గెడపవేల
కరుణ రాదేల? మామీఁదఁ గలితశీల!
వినుతగుణజాల! మామొఱ్ఱ విన వదేల?
ఏల యీలీల? లేచిరా వేల? మేల?

వెంగ.—వెంకయ్యగారూ! ఏమి చెప్పుదును? మాయన్నగారు మనలం బాసి దివం బలంకరింపఁబోయిరి సుఁడీ! హా! మనదౌర్భాగ్యము.

గీ. అస్తమించెను బొబ్బిలియంబరమణి
అస్తమించెను పద్మనాయకవిభూష

అస్తమించెను వెల్మలనిస్తులయశ
మస్తమింపవె? మాయన్న యస్తమింప:—

అయ్యా.—వెంకయ్యగారూ! రాజకులబడబానలుం డగు నావిజయరామ నృపాపశదుండు తెచ్చిపెట్టిన యకారణదారుణయుద్ధనామక మహానలంబునఁ బడి యన్నగారు దగ్ధులైరికదా! ఇఁక మన మెవరికొఱకై యుద్ధము చేయుట? జయంబు వడసితిమే యనుకొనుఁడు. ఇం కెవరినిఁ జూచి బొబ్బిలికోటలో నడుగు వెట్టుట? "మఱఁదీ! నీయన్న గారెచ్చట" యని అడిగినచో వధూనిక కేమి ప్రత్యుత్తర మీయఁగలను? అట్టి యన్నను బోఁగొట్టుకొన్న పిదప నేనుమాత్ర మేల జీవించియుండవలయు? ఇదిగో! ఆయనచెంగటనే స్వఖడ్గప్రహారమ్మునఁ బరిత్యక్తజీవుఁడ నయ్యెదను.

వెంక.—వేంగళరావుగారూ! పురము తురకలవశ మగునేమో యని యన్నగారు శంకించి, కాంతాజనంబుల నెల్లఁ ద్రవ్వనేయ నాకాజ్ఞాపించిరి. విధిలేమి వారియానతి నెఱవేర్చి వచ్చితి. ఇఁక, బొబ్బిలిపురిలో నాఁడుపురుగైనను మిగిలియుండలేదు.

వేంగ.—(దుఃఖముతో) హా వధూనికా! హా బొబ్బిలిపురకాంతలారా! మీయెల్లరిభాగ్యములుకూడ నీరీతిగ నున్నవా!

మ. అకటా! యెంతటిఘోరవార్తయిది? మాయమ్మయ్యో నే పద్మనా
యకవంశ మ్మొకలిప్తలోన నిటు లన్యాయమ్ముగా నేఁడు పెం
డ్లికి నేతెంచినయెల్లబందుగులతో? నే నేల? యీనేల నూ
రక జీవించుట సిగ్గుమాలి: ఇదె? నే ప్రాణమ్ములఁ బాసెదన్.

(పొడిచికొన నుద్యమింప వెంకయ్య వారించును.)

వెంక.—వేంగళరావుగారూ! మనల నింతగా చేసినయావిజయరామచండాలుని, ఆతురుష్కాధమునింగూడఁ దెగటార్చినపిదప మనము మ్రందవచ్చును. లేనిచో జగము లుండుదాఁక జనములు మనలఁ బౌరుషహీను లనరా!

చూడుఁడు: తగుచమూనాయకుఁడు లేఁడని తురకబలంబులు పెల్లుబ్బి మనకోటలోని కెట్లు ప్రవేశించుచున్నవో!

వెంగ.—(చూచి కోపచిత్తుఁ డయి) ఏమేమీ! నేను జీవించి యుండఁగ నీయవనాధములు బొబ్బిలికోటలోనికిఁ జొరఁబడుటయే?

శా. రేరే! ముష్కరపారశీకపశువా! రే హైదరా! మూర్ఖ! రం
గారాయప్రభుమౌళిసోదరుఁడు వెంగళ్రాయఁ డుద్దండచం
డారాతిప్రకరోత్తమాంగవిలుఠత్ప్రావీణ్యదర్పోగ్రవి
స్ఫారుం డీదెస నున్నవాఁ డనుచు నెంచన్ లేదొకో బాలిశా!

గోరీ! తురుష్కవంశసంభూతా! లంచగొండీ! హైదరా! రేరే! యవనచమూనాయకులారా!

శా. అన్నన్ సద్గుణగణ్యు జంపినమిమున్ హాహారవంబుల్ చెలం
గ న్నిర్జీవులఁ జేయ నేను బ్రతినన్ గైకొంటి: మీలో నెవం
డున్నన్ మేటిమగండు నన్నెదురుఁడీ! యుగ్రాజి మీబాహుద
ర్పోన్నత్యంబులఁ జూడ డెందమున నాహ్లాదంబు వాటిల్లెడిన్.

[పటాక్షేపముగ నిష్క్రమించుచున్నారు.]

---

శ్రీ ర స్తు.

ఓంనమో మార్తండగురుపరబ్రహ్మణే.

# శూ ర బొ బ్బి లి.

---

## పంచమాంకము.

రంగము–యుద్ధభూమి.

విజయరామరాజు–హైదరుజంగు నుందురు.

హైద.—హేటి యిజ్యారాజా! నీదీబాత్ నమ్మి యుద్ధం సెస్తే మాఖీ సాలా మోసం హైంది. లాడూ మర్గయా. లానూ మర్గయా. షుకురల్లీ హాసనల్లీ మర్గయా: మాది అష్కర్ మే మంచిమంచ్‌వస్తాద్ హుంది వాళ్లంత సచ్చిపోనార్! హెంతఘోరం హైంది.

విజ.—అయ్యా! నేను తమతో మొదటనే మనవిచేసి యుండలేదా!

చ. వెలమ లమేయవిక్రములు వెఱ్ఱియె కాని రణాంగణంబునన్
దలఁపరు మిమ్ము నం చనని? దానియథార్థ మెఱింగినారలే
పలుచగ నాఁడు చూచితిరి వారల:నేమని యెంచినారు? బొ
బ్బిలిని జయించు టన్నఁ బృథివీస్థలి నర్హము గెల్చుటే సుఁడీ!

చాలవఱకు నిహతులైరి కాని, యింకను శత్రుశేష ముండకపోలేదు. వెంగళరాయఁడు చనిపోయినజాడ కానరాకున్నది. చెలికానివెంకయ్యకూడ నింకనున్నాఁడేమో?

హైద.—వాళ్లూ హింకా హున్నార్ బోల్తావ్: పంతేంబుచ్చాయ్ యిన్గా వర్సడ్ మాత్రేల్‌సా యిగ్గాదమ్మాయ్ రంగ్డూ దమ్మం యెంకం హాం

దూ్రి మర్గయా పెప్నార్: యెంకాం యెంగ్డూ సచ్చేడ్ లేద్ బోల్తా—హిజ్యరాజా! మాదీ బారాలాక్ రఫియామే దేవ్:

విజ.—అచిరకాలములో మాకు బొబ్బిలి పట్టాభిషేకము జరుగునుకదా! అప్పుడే యీధన మంతయు నొసంగెదను.

హైద.—రాజా! నీఖీ సాలా ద్రోహం సేసింది వోయ్: భొబ్లీవాండ్లోళ్లా భిడ్లూ హంతా వాగ్గిలో పడి మర్గయా సెప్నార్! హై బోల్తా! హీది పాపం హంతా నీది.

విజ.—ఈకృత్య మొనరించినవారు మీ రగుటచే నీపాప మంతయు మీది కాని నాది కాదు. అంచముం గొనకుండినచో నాదియే యగును.

హైద.—(కోపముతో) బద్మాష్‌మాటల్ సెప్తావ్ మాఖి! నీఖి సెప్తే మాఖి నేసేవ్! మాఖీ పాపం హిందుక్కు వస్తావ్ మియ్యా! ముల్లా హిట్లాఖాత్ బోలో! నీఖి సంపేస్తామ్!

వెంగ.—(తెరలో)

శా. ఏడీ హైదరుఁడెందు డాఁగొనియె? వాఁడెచ్చోటనున్నాఁడు మా తాడం జాలక యుండెనేమిటికి? మాయాయుద్ధమం దగ్రజున్ పాడిన్ దప్పి వధించినట్టిఖలు నస్త్రశ్రద్ధా రాహుతిన్ బీడింతున్ బ్రహరింతుభూతములకున్ మృష్టాన్నముల్ పెట్టెదన్.

విజ.—అదిగో! వెంగళరాయనిగొంతువలె నున్నది. అతఁడు మిమ్ముల వెదకి కొనుచు నాయాప్రాంతములఁ దిరుగుచున్నాఁడు. ఇటకు రాకుండఁగనే మీరు పోయి వానిన్ దలపడుఁడు.

హైద.—హింకా యెంగ్డూ భత్కు హున్నాడ్ హోయ్:—మాఖీ హిద్ధం సెప్పి సాలా హుర్నింది. మాఖి రంగ్డీఖి సంపింది. నీఖి యెంగ్డీఖి సంపు.

విజ.—వలదు వలదు! మీరే యీయన్నదమ్ముల నిరువురం గూడఁ జంపుఁడు: నే నిందుండి చూచుచుండెదను.

హైద.—(కోపముతో) లుచ్చారాజా! బద్మాష్‌రాజా! నీది థోంగమాటా యిన్కోని మాది యెంతదోఘం సేసింది. భొబ్లీవాడూ నీఖీ డబ్బా యిస్తావ్ సంధి సేస్కో సేస్కో హంటూ యెంకంపంపి దమ్మయ్‌పం పె సెప్నా యిన్కా హెంతాదోఘం సేసేమ్: హాచ్ఛాహాచ్ఛా యీ ర్లు హాంతా మర్గయా సేసేర్ : నాదీ మర్గయాఖి నీది హిప్టు నూస్తావ్! జావ్ జావ్! లడాయ్కొ జావ్! హంత యుద్ధం నూస్తే భయ్యం సెస్తే కైకూ రాజ్యా హైనావ్ నివ్వు: నీది భల్మా వాడ్కొ సూపించు. మై దేఖ్తా!

విజ.—(తనలో) అక్కటా! ఈతురకవానిమాటలు భరింప శక్యము కా కున్నవి. ఎట్లయినను బోరక తీఱదు. పోరినచోఁ బరాజయమే నిశ్చ యము. ఏమైనను దైవ మున్నాఁడు. (పైకి గంభీరముగ) సాయుబేంద్రా! ఇదె నా ప్రతాపముఁ జూపెద నాతఁడు రానిండు.

వెంకయ్య.—(తెరలో) హతశేషులగు వస్మత్సైనికులారా! ఏల మీరిటు మాఱుపలుకక యూరకుండెదరు?

ఉ. రాయనిగారిపైన నపరాధముల౯ వచియించి ధూర్తులన్
సాయముఁ గొంచు వచ్చిననృశంసుఁడు బొబ్బిలికోటపాలన౯
జేయుద మంచు నెంచునవినీతుఁడు నావిజయేశుఁ డేడి? నే
నాయనతోడఁ బోరుటకునై చనుదెంచుచునుంటిఁ జూపుఁడీ!

హైద.—(భయము నటించుచు) హిజ్యరాజా! హెదిబాత్ వంకాయ్ పెత్తాడ్ హుంది. వాడూకూడా హింకా భత్కొహున్నాడ్ హాయ్: మర్గయా నస్లేద్: లేఖ్ పోతే భొబ్లీవాళ్లూ ముందు వచ్చి మళ్లాత్రల్ట మాఖీ మార్నెఖు వస్తార్ బోలో.

పిదప రౌద్రాకారముతో ఖడ్గధరుఁడగు వెంగళరాయఁడు
ప్రవేశించుచున్నాఁడు.

వెంగ.—ఓహో సైనికులారా!

సీ. బొబ్బిలికోటలోఁ బొగతోట వేయించి
చుట్టుఁ గాల్పఁగ నున్న శూరవరుఁడు
దురమున నూఱ్కోడి తురకలపాదమ్ము
లాశ్రయించినమహాపావబలుండు
పద్మనాయకనామవంశమ్ము నిర్వంశ
మును జేయఁ బ్రతీనఁ బూనినఘనుండు
నిష్కారణశత్రుత్వమ్ముగా నేఁటి యాకయ్యమ్ముఁ
దెచ్చి పెట్టినమహోద్యచ్చరిత్రుఁ
తే. డస్మదన్వయపరిపంథి యగున్నృపుండు
విజయనగరమ్ముఁ బాలించువిభువరేణ్యుఁ
డైనవిజయేశుఁ డేమూల నడఁగియుండె
తెలుపుఁడా నాకుఁ బోర నేతెంచినాఁడ!

హైద.—(విజయరాముని ముందునకుఁ ద్రోయుచు) హ రే: యె న్యా—యె న్యా—
పోతావ్: ముంద్కు— యెల్ వోయ్: శిఖ యుద్ధం సెయ్ పిలుస్తాడ్:

రంగ.—(హైదరుం గాంచి విషాదాగ్రహములతో) ఓరీ! యవనచండాలా!
ఎంతపని తెచ్చిపెట్టితివిరా!

.. కోట బంధులు సుతులు మాకోమలాంగు
లవుర నీమూలమునఁ గాదె? యగ్గిఁ బడిరి
మావిరోధి వచించినమాయమాట
లెల్ల నమ్మి నీ విటు చేసి తేర క్రూర!

..ని కాని! నీ కిది యంతయును దైవము కట్టికుడుపక పోఁడు. దైవమును
..రించికొని చచ్చుటకు సిద్ధముగ నుండుము. ఇదే చూడుః నాకతారిచే
..కంఠచ్ఛేదన మాచరించెదను. (కత్తిసాము ప్రదర్శించుచున్నాఁడు.)

హైద.—క్యా హిజ్యరాజా! మొద్దులాగా మాటసెప్కా— హెన్యా—
హెన్యా— పోతావ్: తుంకు షరమ్ నహీంహై యెంగ్డిశి మారోమారో!

విజ.—(తనలో) ఇంకిట్లును నా కిది తప్పదు. (పైకి) ఓరీ! పరుషప్రలాపీ! వెడఁగువేడబములఁ గొన్నిఁటిఁ బచరించి మమ్ముఁ గామార్గాన వచ్చి తివిరా ?

కవిరాజ. గరువమె యున్న ముఖాముఖిఁ బోరుము
కారుప్రసంగము లేటి కిటుల్
పరుసఁదనంబునఁ బల్కఁగ? నీదుప్ర
భావము చూపుము కల్గినచో
దురమున నన్ను నెదుర్కొని పోరుము:
దుర్మద! నిన్ను వధింతు మహా
త్తర మగునాతరువారున నీతల
ధారుణిఁ గూల్చెదఁ! దాళుమురా!

వేంగ.—ఓహో ! విజయరామరాజుగారా ! వీరే కాఁబోలు బొబ్బిలి గెల్చి యందు సింహాసనంబు నధిష్ఠింప నుంకించు బుద్ధి బృహస్పతులు ! (కోపముతో) చండాలుఁడా ! నీమూలమున మీరాచకొలమ్మున కెల్ల నపయశంబు వచ్చినదిరా? ఓరీ! మూఢుఁడా! న న్నని నోర్వ నూహించు చున్నావురా ?

కవిరాజ. సరిసరి ! నీవన చాల నెఱింగితి
సంతన మయ్యెను మూఁఢుఁడ! సం
గరమున మానరి కాకయె చింతిలి
గౌరవమున్ విడనాడి యిటుల్
తురకలపాదములం దలఁ దాల్చితె?
తుచ్ఛుఁడ! చాలుఁ బ్రతాపము లె
వ్వరిదెసఁ జెప్పఁగ బూనితి వోరి!భ
వద్భుజసాహస మెల్ల ఖలా !

నీవింత నిర్భయముగ నాయెదుట నిల్చి నాతో మాటలాడఁ గలవనియే నే

కనుకొనలేదు. నీప్రతాపము చూచుటకయిరే యేనుం దొందరపడు చున్నాను. ఏదీ చూపుము. (వేంగళరాయ విజయరాముల ద్వంద్వ యుద్ధము.)

హైద. హిది పమ్యంలో మాం హింట్కె పరారీ సెప్పి మాది షేనల్కె పంప్తామ్: లేఖ్ పోతే హెంగ్డా హిజ్యాఖి షంపి మాడీ మార్నేఖు వస్తే మై క్యా కరుమ్. (పాఱిపోవును.)

(కొంతవడి పోరి విజయరామరాజా పాఱిపోవును.)

వేంగ.—ఓరీ గౌరవహీనుఁడా! తుదకు పలాయనపరాయణుఁడ వైతి వేమిరా!

క. సిగ్గఱి పాఱె దేల? చలచిత్తుఁడ! సంగరసీమ కాని, నీ
పగ్గెనుఁ జూపి కొండెములు పల్కుట కాదిది: శత్రులన్నఁ బై
జగ్గులఁ గాంచి భీతిలరు చంపుట చచ్చుట నేయకున్న నా
డెగ్గులఁ బల్కినట్లె యిది యేఁగు నటంచుఁ దలంచి వచ్చితే?

మ. పరువా రాచకొలమ్మునందు జనియింపన్ లేదె! యీరీతి సం
గరభూమిన్ విడి పాఱువీరుఁడ వహో! కయ్యమ్ము చేయంగ ము
మ్మరవృత్తిన్ జను దేర నేల? ధృతి వీకన్ వీడఁగా నేల? దు
శ్చరితా! క్షాత్రము వీటఁ బుచ్చితివి నీజన్మం బీఁకన్ గాల్పనే?

గీ. చెలఁగి మాపైని నీఁ గొండెముల్ చెప్పఁగలవె?
సాయెబుల కెంతొ లంచమ్ము లీయఁగలవె?
ఔర! అస్మత్కుఠారధారారభటికి
వీఁగి పోకుండ నిల్వలేవె? దురాత్మ!

మ. పోకుము పోకు మోయిన్నృపపుంగవ! నీయనుచుల్ గ్రహింప న
త్యాకులపాటుఁ జెంది భయ మందకు పాఱెడివారిఁ జంపుదు
ర్ధీరులు కారు వెల్మలర రే? యిసిరో! యిటువంటివాఁడ వే
లా! కడు నల్కఁ బూనియనికై చను దెంచితి వోరి దుర్మతీ!

ఈతండు మత్ప్రహారణంబుల కోఁగఁజాలక పలాయితుఁ డైనాఁడు. ఈ పిటికితురకకూడ నాకగపడకుండ నెం దేఁగినాఁడో:–అందఱును బ్రం దినపిదప నేనుమాత్ర మేల జీవింపవలయు ? ఈహైదరుఁ జంపి యే నుగూడ బలవన్మృతి నొందెదఁగాక! ఓరీ! హైదరూ! నీ వెందడంగి యుం డినను విడువక యీవెంగళరాయఁడు పట్టి వధించునురా? మూర్ఖా గ్రేసరుఁడా !

వనమయూరము. సుందరులు బ్రందిరి విశుద్ధతరవహ్నిన్
అందఱును జచ్చిరి మహారణమునందున్
నందియు మిఁకేల నినుఁ జంపుటకునై నే
నిం దరుగుదెంచితి నిసీ! యిటకు రారా!

డాఁగక బయటపడి రమ్ము.

(కొందఱు తురకజోదులు ప్రవేశింతురు.)

తురక.—వెంగ్లారాయ్‌కి పట్కో సంపూమే మాదీ హైదర్ ఫర్మానా హైంది. హెట్టా పగడోకి మాఖి మాలుమ్ నహీ :

వెంగ.—(కోపముతో నట్టహాసము చేయుచు.) దురాత్ములారా! మీ రెల్లరు నాతో యుద్ధ మొనరింప నేతెంచినారురా ! రండురా ! రండు. మీతల లెల్ల వెలగపండ్లవలె భూమిఁ బడఁగొట్టెదను.

మ. వెలమల్ పౌరుషశాలు లంచవనిలో విఖ్యాతి దోపింప ని
స్తులదర్పోన్నతిఁ జూపువాఁడ నిదె! యిచ్చో మత్కృతాస్త్రమ్ము
గలనన్ వీరల నెల్లఁ గూల్చెదను వీఁకన్ లేనిచో వీరిచే చేఁ
తులలోఁ జచ్చి మదగ్రజుఁ గలసికొందున్ స్వర్గలోకమ్మునన్.

(చిత్రముగ సాము చేసి పెక్కండ్రఁ గూల్చి మూర్ఛిల్లుచున్నాఁడు.)

బూసిదొర.—(ప్రవేశించి) అక్కటా! నే నెంత చెట్టఁ గావించితిని? వెల మలు కడుబలము కలవా రనియు, చెట్టలు సలుప రనియు వినుటయే కాక, యొజ్జలు వ్రాసిపంపినకమ్మఁ దిలకించి, మది మార్చికొని, లంచగొండి

యగు హైదరునిచేఁ దిరుగ మోసగింపఁబడి బొబ్బిలిపయి దాడి వెడలితిని. ఎంతమొన వమ్మయ్యెను. ఎంతమందిజోదులు సమసిరి. గెల్పునుగుఱించి దిగు లొంది బొబ్బిలికోట నంతయు మంటఁబెట్టించికొని, యందలి జవరాండ్రు, బిడ్డలు, ముదుసళ్లనుగూడ నాయగ్గిం బడి మ్రగ్గిరి. ఏమైననుఁ గోట దొరకినదా ? ఎందఱనో నేలపాలుఁ జేసి యీబొబ్బిలిబిరుదుమగలందఱు సమసిరి కాని, యింకను వెంగళరాయం డున్నాఁడఁట! విజయరామునిఁ బొఱిఁదోలి, హైదరుజంగుం దాఁకుటకయి యెంచుచుండెనఁట-(మూర్ఛపడియున్న వేంగళరాయుఁ జిలకించి) ఆదిరా! ఈజో దెంతమందినిఁ గూల్చి తాను సొమ్మసిల్లినాఁడు. అహా! ఈతనిపస యెంతయోనిఁ బొగడ్తకుం దగినది. మున్ను విన్నదానికిని, నేఁడు కనుఁగొన్నదానికిని సరిపోయినది.—కొలువుడు కాఁడా! నీ వీజోదుని నాగుడారమునకుఁ దోడ్కొనిపోయి నాసొంతవెజ్జుచే నీతనిగాయంబులకుఁ గట్టుఁ గట్టింపుము. నేనుగూడ వచ్చుచున్నాఁడ: (నిష్క్రమించును తెరదిగును.)

---

## రంగము - బయలు.

శోకనిమగ్నుఁ డగు పాపారాయఁడు ప్రవేశించుచున్నాఁడు.

పాపారాయఁడు.—అక్కటా! ఎంతలో నెంతగతి ప్రాప్తించినది? ఎఱిఁగి యెఱింగి, యిది యంతయు మేమే మనసారఁ దెచ్చికొంటిమి: నన్ను రాజామున కేఁగు మని చెప్పినపుడే వైరిసేన యాదారింబడి వచ్చునో, రాదో యని సందేహపడి యుంటి: మనమునం దాసందేహము పొడకొని యున్నను, బావగారియానతి యనుల్లంఘ్య మగుట, విధిలేక, పురి వీడి పోవుటకు సమ్మతించితిని. రాజామునం దుండి, యే నేమేనిఁ జేయఁ గలిగితినా ?—అయ్యో! శత్రువు లాదారింబడి వచ్చియుండినచోఁ గదా! వారలఁ దాఁకి, మత్ప్రతాపంబుఁ జూప నవకాశము కల్గియుండును. ఎంతటిబాహుబలము కలిగి యుండినను, ఎంతవిక్రమము కల్గియుండినను అది యొల్లనేఁ డక్కఱకు వచ్చినది కాదుకదా! సమయమున కక్కఱకు

రాని పనికిమాలినపౌరుష ముండిన నేమి? మండిన నేమి?—నిన్నఁటి సాయంకాలమువఱకు యుద్ధము జరుగుచునేయుండెనఁట? ఆసంగతి నంతయు నా కెఱుఁగవచ్చినదికాదే?—అక్కటా! ఇట్లగునని నా శోకించుటకు ముందుగ తెలిసియుండెనా! ఏ నిక్కడనే యుండి, సకలశత్రుపరంపరఁగూడ నొక్కరుండఁ దాఁకి రణరంగంబున వారల నెల్ల భూతబలి యొసంగి యుండనా! ఆయవనహతకుల నెల్ల మామకవిక్రమానలంబునకు శలభంబులఁ జేసియుండనా! ఎట్టికష్టకాలమందైనను, ఎంతెంతలేని యాపదలు వచ్చి మమ్మెడఁబాపఁ జేయ నుంకించినను, తుద కీవిజయరామనరపాలకుండే మారాజ్యమునం దిదివఱ కల్లరులఁ జేయించి మమ్మఁ బెక్కుచిక్కులపాలు పఱచినప్పుడైనను, ఒకనిమూసమేని విడిచి యెఱుఁగని నాభావమఱఁది నాపంచప్రాణములుకూడ నతఁడే యని యూహించువాని నాపద్మనాయకవంశశిరోవిభూషణమును, నాబాహువిక్రమవిదారితసకలశత్రుసేనావారనిచయము, నానాఁడే యకారణంబుగ విడిచి పోయితినే?—అకటకటా! ఇంకను వెంగళరాయనివివాహమునకు రాఁ జాలనైతిఁ గదా యని యింతదనుక, విచారించుచుంటిఁ: అయ్యో! నాయట్టివిచార మట్లుండ, నేఁడు మిమ్మెల్లర జీవించియుండ నొకసారియైనఁ జూడఁజాలనైతిని కదా! యని విచారింపవలసి వచ్చెనే?

ధీరగుణశేఖరా! బావా! రంగారావనిపాలా! రణరంగంబునం దెల్ల నోర్చి శత్రుపరంపరం బరిమార్చి, విజయలక్ష్మీపరివృతుండ వైతివా యని పలుకరించుటకు మాఱుగ, అయ్యో! నీమరణవార్తయా విని విచారింపవలసివచ్చినది. ధనుర్మాత్రసహాయుఁడవై, శత్రుసేనావారంబునఁ జొచ్చి యవక్రపరాక్రమము చూపుతఱి, ప్రళయకాలదీప్తమధ్యందిన తీవ్రచండగభస్తిబింబ ప్రతిమానభీకరంబగు నీయాకారంబు చూచి యానందింపనైతిఁగా!—బావా! నాయం దెంతయో నమ్మకము కలిగి యే నొక్కరుండఁ బరిపంథికులంబు నెల్లఁ బరిమారింపఁగలనని మది నభిలాషఁ బూని యుంటివే? అట్టి నేను బ్రతికియుండియుఁగూడ నీకు మర

ణము తటస్థించుతటి వీరులగతి నేమూలనో యడఁగియుండి సమయమునకు లేనివాఁడ నైతినిగా!—తురకబలంబులు వచ్చి కోట ముట్టడించిన వని నాకు నింత వార్తయేనిఁ బంపియుంటివా! చెక్కులఁ గట్టికొని వచ్చి యప్పుడ నీపదసమీపమున వ్రాలియుండనా! సకలశత్రుపరంపరం గూడఁ జీకాకుపఱచి నీయెడకు వారినిఁ గొనితెచ్చియుండనా! ఇట్టుగ పుత్త్రమిత్త్రకళత్త్రాదులతో మృతియే లేకుండునే? నిర్భాగ్యులమగు మన కది యెట్లు ప్రాప్తించును? ఈగతి విచారింపవలసియుండఁగ నీ కా యూహా యేల జనించును? అటులే జరుగవలసియుండినచో నన్ను రాజాజ్ఞమున కనుపక యిచ్చుటనే యూనిచియుందువే?—అయ్యో! ఎంతలోఁ బొరపడి యిట్లనుచున్నాను? దండు విడిసినతోడనే నన్నుం దోడ్కొని రమ్మని రామయ్యగారి నంపియున్నావఁట! దారిలో నాతని విజయరామునిసైనికు లరికట్టి రహస్య మెఱుఁగఁజేయమిఁ బిరంగివాతఁ బెట్టినారఁట! అధురాత్ముఁడగు విజయరాముఁడు మనకు సర్వవిధముల నపకారము సేయుచునే యున్నాఁడు. వెంకటలక్ష్మి నీకుమారునిఁ జామర్లకోటకుం గొంపోవుచుండ వారిం జంప యత్నించినాఁడఁట!—అయ్యయ్యో! మీయెల్లరకయి యిటు విచారించుచుండుటకేనా యే నింకను చావక బ్రతికియుండినది? అక్కటా! మత్పూర్వకృతకర్మవృక్ష మిట్లు పూచి ఫలించియుండఁగా, తత్ఫల మనుభవింపక తీఱునా!

కట్టా! మిమ్ముం బాసి పోవ నొల్లక యప్పగారిచేతను, బావవెంకళరావుగారిచేతను గూడ ననేకవిధముల మీకుం జెప్పఁజేసి, నాప్రయాణ మాఁప యత్నించితినే! 'వెంకళరాయనివివాహమునకు నేనుండవలదా! నాకుమాత్ర మది సంతోషజనకము కాదా!' యని యెన్నియోవిధంబుల మిమ్ముం బ్రతిమాలితినే! మా వేఁడికోలెల్లఁ జెడచెవినిఁ బెట్టి రాజాజ్ఞ ప్రయాణము విధిలేదని శాసించి, పట్టుఁబట్టి నన్నుచట కంపితివికదా! అయ్యయో! మీయెల్లరిముఖము లేనిఁ గన్నులకఱవుదీరఁ జూడఁ జాలనైతినే. అక్కటా! నాఁటిచూపులే మనకుఁ గడసారిచూపు లయ్యెనా!

అబ్బా! ఈదుఃఖసముద్రము తరించుటకు నాకేది దారి? ఇలపయి నేను జీవించియుండి యింక నేమి చేయవలెను?

అప్పా! మల్లమాంబా! బావగారు నన్ను రాజామున కంపుచున్నా రని నీతో మనవిచేసినపుడు; ఎన్నఁడుగాని కంటఁ దడివెట్టియుండని నీవు నాఁడేల దుఃఖించితి వమ్మా! "తమ్ముఁడా! శత్రుకులము నున్మూలించి శీఘ్రముగ మఱఁదిపెండ్లికి రామానెదవు సుమీ! నా కది విచారకరముగ నుండు" నని యేమేమియో చెప్పితివే? అవియన్నియు మఱచిపోయితివా! నీమఱఁదిపెండ్లియేని సాంతముగ చేయక నీ వరుగుట యుక్తమమ్మా?— అయ్యో! పెండ్లి పెండ్లి యని కలువరించుచున్నాను. పెండ్లికి వచ్చిన యెల్లరుబంధుగులు నిహతులైరే? స్త్రీజనంబు లెల్లరును దారుణాగ్నిం బడి తమజీవంబులఁ బాసిరే?—అక్కటక్కటా! ఏ నింక నెన్నికోట్ల జన్మము లెత్తినను నా కట్టియప్పయు బావయు దొరకుదురా! ఏ నేమి చేసినను మీరు నా కగపడరు కదా!

హా! అక్కా! బావా! బొబ్బిలిపురవీరులారా! కాంతాజనంబులారా! మీరు నా కొక్కసారి కనపడరాదా! కాదేని మీయెల్లరుం డెడితావున నీనిర్భాగ్యునిఁ గూడఁ గొనిపోయియుండరాదా! నన్నొక్కని నిందువిడిచి మీయెల్లరేఁగుట చాల నన్యాయ మగుఁ జుండీ!—అయ్యయో! మీయెల్లరు గతించినపిదప నేనుమాత్ర మీభూమి నేల మనియుండవలయు? ఉండఁజాల నుండఁజాల! నా కీప్రాణమును వలదు. పట్టణమును వలదు. వెంగళరాయచినరంగరాయలఁ జూచుటయు వలదు. ఈపరాభవము సైఁగెంచుటయు వలదు. ఏమియు వలదు. ఏమి యుండినను, ఏమిలేకపోయినను మాయక్కయు బావయు నాకు లేకుండిరి కదా! కావున మాబావ పడియుండినచోటికరిగి, వారి కగ్నిసంస్కారంబు గావించి ఆయగ్నింబడి మ్రగ్గెదను. లేదా! ఈఛురికంగొని కంఠచ్ఛేదన మాచరించికొని జీవంబులఁ బాసెదను. ఏనూతనో పడి పరిత్యక్తజీవుఁడ నయ్యెదను. కాని జీవించియుండఁజాల! నిక్కముగా నీప్రాణముల భరించి యుండఁజాల!

అక్కటా! దుర్భరము-దుర్భరము - ఘోరము - విచారము-వియోగము-అయ్యో! నే నేల జీవించియున్నాను? నాకేల మృతి కలుగకున్నది? హా! అక్కా! బావా! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

(కలఁగని లేవకరయే) ఏమనుచున్నావమ్మా! మనల నింతగాచేసిన యీ విజయరామాధముని౦ జంపినఁగాని, నాకును మీబావకును పరాభవాగ్ని చల్లాఱదని చెప్పుచున్నావా! (దద్దరిలి లేచి నలువంకలు కలియఁజూచి శోకముతో)

శా. అమ్మా! మల్లమదేవి! కోటవయి సైన్య మ్మట్టు లేతేర, నీ
వెమ్మాడ్కిఁ మది దుఃఖ మందితివో నీయీరూపమే చెప్పు. నీ
తమ్ముఁ బాపయు నెంచి యెంతవలవంతఁ బొందినావమ్మ! జీ
వమ్ముఁ బాయఁగడంగువేళను నెటుల్ వాపోయినా వప్పరో!

హా! బొబ్బిలిపురీశశాంకా! నీ కెంతవంత ప్రాప్తించినది?

ఉ. రంగనృపాల! ధీరగుణరాజిత! నిత్యయశోవిశాల! నా
కుం గడుఁగూర్చుబావ! రణకోవిద! క్రూరపరానుమూఁకచే
భంగము నొందితే? హితుల బందుగులఁ మము నెల్ల వీడి: దు
స్సంగుఁడు రామభూపతినృశంసునిమాయలఁ జిక్కి యక్కటా!

హా! రంగారాయా! సుకవిగేయా!

శా. శ్రీ రేచెర్లకులాబ్ధిచంద్ర! గుణరాశీ! సర్వదిగ్వ్యాప్తవి
స్ఫారోదంచితకీర్తిసాంద్ర! నిహతప్రత్యర్థి! యీనాఁడు దో
స్సార మ్మెంతగ చూపితో కనుదృష్ట మ్మేనియుఁ లేదె? రం
గారాయప్రభుమౌళి! నీదగువియోగ మ్మెట్లు సైరించెదన్.

ఏ నిందు లేనితఱి యోజించి తురకలసాయముఁ గొనివచ్చి మాప్రభువులఁ బరిమార్చినాఁడుకదా! ఈవిజయరామరాజు. కాని!—వీని నేనొక్కరుండఁబోయి చిత్రముగ భూతబలి యిచ్చి యీనెత్తుట మాబాంధవశ్రేణికిఁ దర్పణంబులఁ జేసెదఁగాక!

స్రగ్ధర. చండత్వోష్మాని మాపై సవసవవిజయత్సోపరుండించు నేశే
కుండన్ వీక్షించిమారాడుడుపతిని మహాయుద్ధమందుఱ్వధించె
స్తుండం బిండిన్ప్రాన ర్తున్గులగులనడఁతున్గుండియల్ ప్రక్కలింతు
న్ఖండింతుఱ్గండడంతుఱ్ఖలుఁడగునతనిఱ్గండకండల్ విడంగన్.
ఆవిజయరామునితోపాటు పారశీకాధముండగు నాహైదరుముంగూడఁ
బరిమార్చి శూబొబ్బిలివిక్రమంబు దిక్కుదిక్కులకుం జాటెద.

వెంకయ్య.—(ప్రవేశించి) అయ్యా! ఆగుడారమానం దెల్లరు గాఢనిద్రా
పరవశులై యున్నారు. ఒకకంచుకిమాత్ర మపుడపుడు కునికిపాట్లుపడు
చున్నను పహరా యిచ్చుచున్నాఁడు.

పాపా.—ఏమిరా! విజయరాముఁడుకూడ నిద్రలో మునింగియున్నాఁడా!

వేంక.—చిత్తము. అయినను నిద్రించుచునేయున్నాఁడు దేవా!

పాపా.—ఇప్పట్లు నేనేమి యొనరించిన బాగుగ నుండును?

సీ. ఇది యేటి కంచు నే నేగుదునా?—మల్ల
మాంబదుఃఖాగ్ని యెట్లాఱిపోవు ?
తెలవాఱుపిదప వారలఁ డాఁకి కూల్తునా ?
ఎవరిది జయమొ ? యెట్లేర్పడింతు?
ఎల్లరన్ లేపి నే నిపుడు ఢీకొందునా?
నృపుఁడు డాఁగున్న నా కేమిఫలము ?
మఱుఁగునఁ బోయి యాధరణీశుఁ ద్రుంతునా?
అక్రమ మ్మౌను నావిక్రమమ్ము.
తే. అక్కటా ? ఇట్టియెడల నేమైనఁ గాని
చేయి మన సొప్పకుండెను నూయి యొకట
నొకట గోయి యటన్నయట్లుండె నాకు
నెట్టు లాక్షూశనృపు వధియింతు నిపుడు.

అన్నిటికన్నఁగూడ నొకటియాచరించిన బాగుగ నుండునని పొడకట్టు చున్నది. అది యించుక ధర్మయుద్ధవిరుద్ధంబే యైనను మహనీయుల మని పేరుపొందినవారిచేఁగూడ నాచరింపఁబడకపోలేదు.

శా. వాలిం బొంచి వధించె దాశరథి; యశ్వత్థామ కౌంతేయభూ
జాలమ్మున్ మడియించె రాత్రి; నరుఁడుర్జనాహించె దేవవ్రతుం
లీలన్ డాఁగొని; వారికన్న బలశాలిం గాను తద్ధారుణీ
పాలుం గూల్పకయున్న నీధరణి జీవ మ్మేటికిం బూనఁగన్.

వెంకయ్యా! ఆవిజయరాముఁడు నిదురించియున్న గుడారమునకు దారి చూపుము.

(తెర యెత్తుసరికి నిదురించుచున్న విజయరామరాజును, కునికిపాట్లు పడుచున్న కంచుకియు నుందురు. పాపారాయఁడు లోనికిఁ బరిక్రమించుట నటించి, కంచుకిం జంపి విజయరామరాజుచెంగట కేఁగును.)

పాపా.—(క్రోధముతో బిగ్గరగ) చ॥ పులిపులి...

విజ.—(తెలివితెచ్చుకొని లేవకయే ఆత్రముతో) చ॥......కొట్టు కొట్టు

పాపా.—(రాజుగుండెలపయిఁ గూరుచుండి, యొకచేత వానిగొంతు నొక్కుచు, రెండవచేత బాఁకుఁ బూని)

చ. (పులి! పులి! కొట్టుకొట్టు:)మిది బొబ్బిలిబెబ్బులి: కాదు గహ్వర
మ్ములఁ దిరుగాడుపెద్దపులి; పూనికమై నినుఁ జంపి నీదుప్రే
వులు మెడఁ దాల్ప వచ్చినది; పుష్కలనూ భవదీయరక్తముం
లలిఁ జవిఁ గాంచ వచ్చినది;లక్ష్యము లేనిది;దీనిఁ జూడుమా!

విజ.—ఎవఁడురా! అక్కడ! తాండ్రపాపయ్య వచ్చి నన్నుఁ జంపయత్నించుచున్నాఁడు. సైనికుల హెచ్చరించి తోడ్కొని రమ్ము.

పాపా.—ఓరోరి దుర్మార్గానువర్తీ! నీ పని యైపదఁటరా! ఇఁక సైనికులపని కావలసియున్నదా! నా రివంబుకే కడతేరినా రని నీ వెఱుఁగవు కాఁబోలు! ఓరీ! దుష్పథగామీ!

మ. పలుకొండెమ్ములు బూసికిఁ నొడివి మాపైఁ గిన్కఁ బుట్టించి త
ద్బలమున్ సాయముఁ గొంచువచ్చితివి రా! వాజిమ్ము! మాపై కిఁ బొ
బ్బిలినిన్ గెల్చితి నంచు నుబ్బకుము; నీబీరమ్ముఁ దూలింప ని
స్తులదర్పోన్నతుఁడైన, తాండ్రకులుఁ డిచ్చోవచ్చియున్నాఁడురా?

శా. పాపారాయఁడఁటన్న నెవ్వఁ డనుచున్ భావించుచున్నావు? నీ
పాపమ్ముల్ ఫలియించె నేఁడిటు: భవత్ప్రాణానిలంబుల్ వెసన్
బాపన్ వచ్చినవాఁడ: నాతురకనే ప్రార్థింతువో? బూసినే
కాపాడంగను రమ్మటందువో? మెదో కావింపుమా మూర్ఖుఁడా!

ఉ. ఏ నిట లేనివేళఁ గుమతీ! చనుదెంచి వధించితే ప్రభున్
చీ: నిను ముక్కముక్కలుగఁ జెక్కెద మచ్ఛురికాప్రయుక్తి ని
ష్ఠైని హరిన్ స్మరించికొనుమీ! తురకాతని మాని, నీవు న
జ్ఞానముచేఁ బొనర్చునపచారములన్ స్మరియించు దుర్మతీ!

మఱియు నోరి ద్విపాదపశువా!

క. మారాజధాని యేలెద
వేరా! సరి: యుండుముండు మేలించెద; ధీ
దూరా! అదిరో కాలుని
యూరో! రెండింటిలోన నొం డేదైనన్.

ఔనయ్యా! నన్నుం జూచినతోడనే ప్రాణము లెడలినవా! లేక, మా
టాడ గొం తెడమీయకున్నదా!

విజ.—పాపయ్యగారూ! నిశివేళ నిద్రాణులఁ జంపునంతటియ[illegible] యుద్ధ
పరాయణు లని మి మ్మనుకొనలేదు. మీరే యిట్టియధర్మమున కొడిఁ గట్టి
కొందురా!

పాపా.—(హేళనగ) ఓహో! మీ కిప్పుడు ధర్మమార్గములు కావలసివచ్చె
నుగా!

ఉ. సరిసరి: ధర్మమార్గములు చాల నెఱింగితి వోరి మూర్ఖ! హై
దరునకు లంచ మిచ్చుటలు ధర్మమె?కొండెము చెప్ప ధర్మమే?
చిఱుతని రంగరాట్తనయుఁ జెండఁ దలంచుట ధర్మమే?మహా
త్తరమగు పోరుఁ గూర్చుటలు ధర్మమె?నీవధయే యధర్మమే?

విజ:—(లేవ నుంకించుచున్నాఁడు.)

పాపా.—ఓరీ! చావక యింకను లేవ యత్నించుచున్నావా! ఇదిగో! నిన్ను నేఁ దుదముట్టించుచున్నాఁడఁ జూడుము:

సీ. ఇది కాచికొమ్ము నీహృదిఁ జీల్చురంగరా
ట్ప్రభు మహాశిరిపు కేలివంతుపోటు
ఇది తప్పుకొమ్ము దుర్మదహారి దామెర్ల
వంశవార్ధిశశాంకువంతుపోటు
ఇది యోర్చికొమ్ము నెమ్మది భీతిఁ జెందక
పాపయ్యదొరగ్గారివంతుపోటు
ఇది తాళికొమ్ము దోర్వ్యదళితచండోగ్ర
పరిపంథి వెంకయ్యవంతుపోటు

తే. ఇదియు కాపాడుకొమ్ము నీ వదరకుండ
బాహుబలశాలిబుచ్చన్నవంతుపోటు
ఇంక రుచిఁ జూడ రమ్ము నిశ్శంకఁ దాంధ్ర
పాపరాయండు రుచి చూపుబాఁకుపోటు.

విజ.—(దీనముగ) అయ్యా! పాపయ్యగారూ! నన్ను మీ రీరీతిగఁ జిత్ర వధఁ గావింపకుండ నొక్కుమ్మడిఁ గుత్తుకఁ గత్తిరింపరాదా! ఈబాధ భరింపఁజాలకున్నాను.

పాపా.—(బాఁకు నేలఁ బడవైచి క్రిందకు దిగి విచారముతో) ఆహా! విజయనగరసింహాసనాధీశ్వరా! విజయరామరాజా! నీ వెట్టిసంకటమందుఁ

జిక్కుకొన్నావు! అక్కటా! ఇట్టిదురవస్థ శత్రుకోటికేని వలదు. ఇట్లుగ నీమృతి వ్రాసియుంచినాఁడా! భగవంతుఁడు.

సీ. నలకూబరాదులఁ దులకించురూపసం
 పద నొప్పునీకు నియ్యది ఫలంబె ?
భోగభాగ్యముల నాపురుహూతు మఱపించు
 విదితభోగునకు నియ్యది ఫలంబె ?
రంతిదేవాదిభూకాంతుల సేవ నొ
 ప్పిద మైననీకు నియ్యది ఫలంబె ?
వసుమతీతలపరిపాలనాధౌరేయు
 ఇభవైరిశౌర్య నీ కిది ఫలంబె ?
తే. ఎల్ల నీచేసినట్టిదుష్కృతులె నీకు
నిట్టిదుర్గతిఁ దెచ్చె రాజేంద్ర నీకు
నిట్టిదురవస్థ వచ్చునం చెన్నఁ డెఱుఁగ
విజయనగరపురీపాల! విభవలోల!

విజ.—(సాయాసముగ) పాపయ్యగారూ! ఆయాసము మెండగుచున్నది. నాయొనర్చిన పాపకృత్యములే మిమ్మిధార్త్యమునకుఁ బ్రేరేచినవి: లేనిచో మీరిట్లు చేయుదురా! శిక్షింపఁ దెగ నేయకున్న నేనీబాధ భరింపఁ జాల కున్నాఁడ :—

క. వె. ఎదిరివచ్చు కోర్కి కీర్తి మీకెల్ల
నెగ్గుఁ దెచ్చినాఁడ హీనుఁడ నయి
అట్టినాకుఁ గీర్తి యెట్టిక నిల్చుఁ బే
రెట్టులుండు బ్రదుకు టెట్టు కలుగు.

ఇంక నాకాల అంతమగునట్లు భగవన్నామస్మరణంబుఁ గావించికొందును. మీపనిఁ గానిండు. నారాయణ! నారాయణ!! నారాయణ!!!

పాపా.—విజయరామరాజా! వగఁ దక్కియుండుము. బ్రదికియుండి యన్నినాళ్లు నిరంకుశలీలఁ బ్రభుత్వంబు నెఱపి యష్టైశ్వర్యంబుల ననుభవించి యపరదేవేంద్రుఁడ వనియు, విద్యాభోజుఁడ వనియు విఖ్యాతిఁ గాంచితివి. అట్టినీవు మరణించినను గూడ మృతజీవుఁడవు కాని,—జీవన్మృతుఁడవు కావు.—మఱియు మాకింత యెగ్గొనరించిన యాదూదేకుల సాయెబును బరిమార్చి నేనుఁగూడ మీయెల్లర చెంతకే వచ్చెదను. (విజయరాముని విగతజీవునిఁ జేసి) ఓరోరి హైదరుజంగా! దొంగా! ఎందు నిదురించి యున్నాఁడవో కాని, బయలువడి రమ్మురా! నే నెవ్వండనో నీ కెఱుఁగరాకున్నది కాఁబోలు! ఇదిగో! యెఱిఁగించుకొను చున్నాఁడ వినుము.

విజయరామునిఁ గాలునివీఁటి కనిపి
తచ్ఛరీరక్షతజరక్తధారలందు
స్నానమాడినవాఁడ! నిన్ జంపుటకును
వేడ్కపడువాఁడఁ బాపయ్యపేరివాఁడ!

మఱియు నిది యొక ప్రతాపముగాఁ జూడరేని, యొండొకటి చెప్పు చున్నాఁడ:

మ. ముక్కల్ ముక్కలు కాఁగ, నీవిజయరామున్ జెక్కితిన్ సేనలోఁ
బెక్కండ్రన్ బరిమార్ప నెంచితిని: దోర్వీర్యంబు చూపించి యే
నొక్కండై యెదురం గడంగుటకునై యొక్కండు లేకుంట నా
కెక్కయ్యెమ్ముముదమ్ముఁగూర్పదెదురై యేతెందుమీరెవ్వరేన్.

(ఎవరును మాటాడకుంట నుపలక్షించి) ఏమిది? ఒక్కఁడును నాకు బదులు చెప్పఁడు. మీరందఱుఁ బనికిమాలినభీరువులురా!—అంతకంతకు మనమ్మున నేమేమియో యాందోళన మధిక మగుచున్నది. ఒక్కరును నా కెదురై పోరకపోయినచో నిది తీరుట యెట్లు? (యోజించి)

ఈవిజయరాముఁడుమాత్రము నా కెదురై పోరినాఁడా యేమి ? వీనిం దెగటార్చినట్లే, యాహైదరుగానిఁ గూడ నిల్గించివచ్చెదను. అప్రక్క నున్నగుడారములో నేకదా వాఁడున్నాఁడని వింటి: ఓరీ ! హైదరుఁడా ! ఇదిగోనురా ! నిన్నుఁ జంపుటకయి వచ్చుచున్నాఁడను. (ఇంచుక పరిక్రమించి, దిక్కులు కలియఁ జూచి) ఏమీ ! వెలుతురు కానవచ్చుచున్నది. కోలాహలము వినవచ్చుచున్నది. అప్పుడే భగవానుండగు భాస్కరుం డుదయించుచతటి యైనదా !—కాలేదే ?—అదిగో ! ఈ జోదులందఱు మేల్కాంచి తమతమయుద్ధపరికరములను సమకూర్చుచున్నారే ? వీరిబోడిగుండ్లఁ బరికించి చూడ వీం డ్రాహైదరుగానిసేనలలోఁ జేరినవారై యుందురు. నేను వచ్చినసంగతి వీరల కెట్లు తెలియవచ్చినది ?—ఆహా ! నాయార్భాటములు కేకలు విని వీం డ్రందఱు మేల్కాంచి యుందురు. ఈయందఱితోఁగూడ ముందుగ నేనే తలపడుదునా ? లేక యాదూరదేశులవీరుని వెదకుదునా !—కాని ! ఆతనినే వెదకెదఁగాక !—

వ్రానిని:—

ఓరిదురాత్ముఁడ! హైదర! యెచ్చటనుంటివిరా! భయమందిమహా
శూరుఁడవే! రణభూమిని డాఁగినఁ జూచెద నీబల మెల్లను నేఁ
బోఱక నాయెదుటం బడిపోరుము: పౌరుష మించుకయుండిన ధీ
దూర! నినుంగనఁ బాపమువచ్చును త్రుంపక మానఁడు నిన్ను ఖలా!

కొందఱు యవనయోధులు ప్రవేశింతురు.

పాప.—ఓహో ! ఈబలంబులెల్ల నన్నుం దాఁకుటకయియే కాఁబోలును! వచ్చుచున్నవి. హైదరుగాని వెదకకుండ నన్నరికట్టవలయునను వీరల యభిప్రాయమై యుండును. సరియే ! అదియును జూచెదను. (సేనల దిక్కయి) ఓరీ! పూర్వసువాసినులారా ! ఇంకను నన్నెదురింపక యచ్చటనే నిలిచి యుంటిరేమి ? రక్తసిక్తాంగుఁడ నగునన్నుఁ గాంచినంతటనే నేనొకభూతము నని పరిభ్రమించుచున్నారు కాఁబోలును ?